శ్రీ

# చంద్రకాంత నాటకము.

ఇది

మోరిగ్రామ వాస్తవ్యుఁడగు

చింతా వీరభద్రయ్యచే

రచియింపఁబడి



నరసాపురము,

తిరుమల వెంకటరత్నము గారి

డయిమండు జ్యూబిలీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁ బడియె.

రెండవకూర్పు 1000 ప్రతులు.

వెల. రు 0—10—0.

1922



గ్రంథకర్త. చింతా వీరభద్రయ్య.

# చంద్రకాంత నాటకము.

—( ఇష్టదేవతా ప్రార్థనము. )—

శ్రీగిరిరాట్సుతా విమలచి • త్తసరోజమిళిందుశంకరున్।
ఆగమవేద్యునిన్ శివుని • సర్కశశాంక కృశానునేత్రునిన్।
భోగివిభూషణున్ రజిత • భూధరవాసుని బాపనాశునిన్।
రాగముమీఱ వేఁడెదను • రాజకిరీటిని రక్షణార్థమై॥ 1

సీ॥ ఏదేవి తనదుప్రా • ణేశ్వరున ర్ధాంగ
[illegible] మాక్రమించెను బ్రతి • జ్ఞాధికమున।
నేభామ సింహంబు • నెక్కి శుంభ నిశుంభ
మహిషాసురాదుల • మడియఁ జేసె।
నేసాధ్విసఖ్యంబు • నిచ్ఛగింతురుసదా
విష్ణుప్రజాపతి • జిష్ణులసతు।
లేతల్లినెన్నుదు • రెల్లశాస్త్రంబుల
సౌభాగ్యవతియని • సర్వజనులు।
నట్టి జగదేకమాత హి • మాద్రిజాత।
సర్వమంగళమాకుఁ బ్ర • సన్నవదన।
యగుచుఁ గారుణ్యముంచి య • త్యాదరమున।
సకల విజయంబు లొనగూర్చి • సాఁకుఁగాత॥ 2

శంకరు ఫాలనేత్రమున • జన్మమునొంది సురాళిదేహముల్।
బొంకముగా నలంకరణ • ముం బొనరింపఁగ వస్త్రసృష్టికై।
పంకజనాభు సూత్రముల • వశ్యమునిమ్మని వేఁడు శర్వము।
డ్రాంకిత దేవలార్యునకుఁ • దంతువులిచ్చెడు విష్ణుఁ గొల్చెదన్॥ 3

అనయము భక్తివర్గమున • కంచితలీలల భాగ్యభోగ్యముల్।
ఘనముగనిచ్చి ప్రోచుహరి • కాంతను లక్ష్మిని బద్మగేహినిన్।
మనమలరారఁ గొల్చెదను • మాదగులేమిని దోలిప్రీతిమై।
ధనమును బాఁడియుంబశుల • ధాన్యసమృద్ధి యొసంగ భక్తితోన్

గీ॥ తమ్మిగద్దియఁ గొలువుండి • నెమ్మిఁ బ్రజలఁ
బొడమఁ జేయుచు వారల • పూర్వజన్మ
కర్మఫలములు ఫలభా • గంబులందు
వ్రాయుబ్రహ్మనుగొల్తుఁ బూ • ర్ణాయువొసఁగ॥

సీ॥ ఏదేవి హస్తమం • దెసఁగె నిర్మలపద్మ
మాపద్మమునలక్ష్మి • యధివసించె
నాలక్ష్మి చెంగట • నసురాంతకుఁడు నిల్చె
నతనినాభిని బ్రహ్మ • యవతరించె
నాబ్రహ్మ కంఠమం • దాగమంబులు పుట్టె
నందుచే మఖకృతు • లతిశయిల్లె
నామఖంబులు ముక్తి • కాధారమైయుండె
దానసద్గతులెల్ల • దక్కుచుండె
నట్టి కారణములకెల్ల • నాదియైన
వాణి యలివేణి మృదుపాణి • బ్రహ్మరాణి
సంతతము నాదువాక్కున • సంచరించి
కవితలో నేర్పుఁగలిగించి • కాచుఁగాత॥ 6

చ॥ కరిముఖదైత్యబాధలకుఁ • గాసిలి సర్వసుపర్వులార్తిచే
మొఱలిడ నేగి దంతహతి • మూర్ఛిలఁ జేసిన దైత్యుఁడంతటన్
మఱలక కొక్కురూపమున • మార్కొన వాహన భాతినేలి ని
ర్జరతతిఁ బ్రీతిఁబ్రోచిన గ • జాస్యుని గొల్చెద నిష్టసిద్ధికిన్॥ 7

శా॥ చిద్రూపుండగు శంభుఁగిన్కమెయి దూ • షింపగ భావించు నా
క్షుద్రప్రజ్ఞుని దక్షుశీర్షము సుర • స్తోమంబు భీతిల్లఁగన్
రుద్రాజ్ఞన్ వధియించి మేషశిరమున్ • రూఢంబుగాఁ గూర్చునా
రౌద్రాకారుఁడు వీరభద్రుఁడు మమున్ • రక్షించు నశ్రాంతమున్॥ 8

ఉ॥ ఎవ్వఁడు కృత్తికాకరుణ • నేపుగ వర్ధిలెఁ బద్మమండమం
దెవ్వఁడు దేవవాహినిక • ధీశ్వరుఁడయ్యె సురాళివేడఁ గా
నెవ్వఁడు దైత్యులంజదియ • నేసెశరాహతిఁ దండ్రియాజ్ఞచే
నవ్వరకార్తికేయుఁడు జ • యంబొసగూర్చుత మాకునిచ్చలున్॥ 9

## గురుస్తోత్రము

క॥ వరచింతాన్వయవారిధి।
పరిపూర్ణ సుధాకరుండఁ బండితుఁడును నై।
ధరవెలయు మల్లికార్జున।
గురుచరణాంభోజయుగము గోరిభజింతున్॥ 10

సీ॥ సరససంగీత స ◆ త్సాహిత్య విద్యలం
దసమాన పాండిత్య ◆ మమరువాని।
ప్రారంభమున నోరి ◆ పట్టణాంతరమున
విద్యాంకురము నాటి ◆ వెలయువాని।
ఆశ్రితానేకుల ◆ కనిశంబు విద్యాప్ర
దానంబుఁ జేయుచుఁ ◆ దనరువాని।
సదయాత్ముఁడై నాకు ◆ సంస్కృత జ్ఞానంబు
నభ్యాసమొనరించి ◆ యలరువాని॥
శ్రీమదియ్యాణ్ణి వంశాబ్ధి ◆ శీతకరుని।
లక్ష్మణాచార్య పుత్రుని ◆ లక్షణజ్ఞు।
నస్మదీయ గురువరున ◆ నంతపద్మ।
నాభ దేశికాచార్యుల ◆ నేభజింతు॥ 11

గీ॥ కాళిదాసాది సంస్కృత ◆ కవివరేణ్యు।
లనుకవిత్రయ మాద్యాంధ్ర ◆ ఘనకవులను।
భక్తి నెంతుఁ గవిత్వంపు ◆ పటిమకొఱకు।
నిందవేఁ చాలు దుష్కవి ◆ బృందమునకు॥ 12

## కవివంశావళి

సీ॥ వసుధ చింతాన్వయ ◆ వారిధి చంద్రుఁడై
ధర్మయ్య పుట్టెను ◆ దారయశుఁడు।
అతఁడు లక్ష్మీదేవి ◆ యందేవురను గాంచె
రామలింగయ్య వీ ◆ రయ్య చంద్ర।
మౌళియు బసవయ్య ◆ మహదేవు లనఁగనా
మహదేవునకు సుబ్బ ◆ మాంబయందు।

వీరభద్రుండు సు ♦ బ్బారాయఁడునుగల్గి
రందగ్రజుఁడు గంగ ♦ మాంబయందుఁ॥
గాంచె సుబ్బరాయుని మల్లి ♦ ఖార్జునయను।
వరుస మహాదేవునిం బస ♦ వయ్యనందు।
ప్రథమజునకు సుతులు వీర ♦ భద్రనాగ।
లింగరామలింగయ్యల ♦ నంగ మువురు॥ 13

గీ॥ అందు జ్యేష్ఠుఁడనేఁ బ్లవం ♦ గాబ్ద చైత్ర।
శుద్ధపంచమి తుహినాంశు ♦ సూనువార।
ముదయమున మృగశిరయుక్త ♦ మిథునలగ్న।
మందుఁ డెందంబు నందునా ♦ నందమొంది। 14

మ॥ క్షితిశ్రీమోరిపురీశ్వరున్ భవహరున్ ♦ శ్రీకంఠు సర్వేశ్వరున్।
కృతికిన్నాథునిఁ గానొనర్చి బహుభ ♦ క్తిన్ యక్షగానంబుగా।
మతినూహించి రచించితిన్ గుణములన్ ♦ మాత్రంబు కైకొంచు స।
మ్మతినాతప్పులఁ గాచి ప్రోవఁ గవులం ♦ బ్రార్థింతు నశ్రాంతమున్॥ 15

మంగళహారతి — అట — శ్రీరాగము

మాసర్వేశునకు మంగళం — మదభీష్టదాయికి మంగళం ॥మా॥
పార్వతీనాథునకు మంగళం — భవ్యచరిత్రునకు మంగళం ॥మా॥
చంద్రకోటీరునకు మంగళం — సారంగహస్తునకు మంగళం ॥మా॥
కరిచర్మాంబరునకు మంగళం — కామసంహారునకు మంగళం ॥మా॥
నిగమాంతవేద్యునకు మంగళం — నగరాట్జామాతకు మంగళం ॥మా॥
మోరిపురీశునకు మంగళం — ముల్లోకజనకునకు మంగళం ॥మా॥





# కథాప్రారంభము.

(ద్వారపాలకుని ప్రవేశము)

దరువు – ఆదితాళము – సావేరిరాగము.

వచ్చెంజోపుదారి వేగమే। సర్దారుఁడగుచు ॥వచ్చె॥ వచ్చెఁజోపుదారిప్రజల। హెచ్చువాక్యములను మాన్ప। నిచ్చగల్గి పిధులంబడి। విచ్చలవిడిఁ బరువులిడుచు ॥వచ్చె ఫాలమునను దిలకముంచి। కేలను ఖడ్గముధరించి। మేలటంచు సభనుజూచి। చాలఁగమది సంతసించి ॥వచ్చె॥ చారులలోపల మేటి। శూరుఁడంచు వినుతికెక్కి। కోరమీసములను జక్కని। తీరుగాఁగొన గోటమిటుచు ॥వచ్చె॥ మొలనుధట్టి బిగియఁగట్టి। తలనుసరిగ పాగఁజుట్టి। యిలనుమోరి ఫరీశునిమది। నింపుగాస్మరియించుకొనుచు ॥వచ్చె॥

స॥ వ. ఓరేకట్టికా! నీవీసభాస్థలికి వచ్చిన కారణమును సవిస్తరముగాఁ దెల్పుము.

ద్వా॥ వ॥ ఆమోద పట్టణాధ్యక్షుండగు చంద్రచూడ మహారాజుగారు తమసభకు రాఁబోవుచున్నారు గావున మీకందఱకు మిగుల హెచ్చరికఁజేయ ముందుగా నేను వచ్చితిని.

(చంద్రచూడుఁడు బుద్ధిసాగరునితోఁ బ్రవేశించుట)

దరువు – ఆది – సావేరి.

రాజరాజయగు చంద్రచూడమహా। రాజువెడలెనిదిగో ॥రా॥ రాజసమలరఁగరిపు క్షితిపతుల ప్రాకరమముల సణఁపఁజాలుదొరయ

స ॥రా॥ విడువక వింజామరములు నిరువుసు వీచుచుండగాను। కదుపడి వెలిగొడుగులు సిడెముల నిరుగడలఁ బట్టగాను॥ పుడమివేల్పులు దీవెనలను జేయఁగ వడివడిగాఁ దనసభఁజేరుచున్నైకై ॥రా॥ శిరమునసవరత్న కనకకో। టీరమునుధరించి యురమున పచ్చలపతకము హిమకర। హారములనువేసి యిరుబుజములకే। యూరములతిసం। బరముమీజః దాలిచియు ముదంబున ॥రా॥ వరకవిగాయక స్తుత్రకపాఠక। వందిమాగధులుకొలువ। కరమరుదుగ నిరుకెలఁకుల వేశ్యలు గానంబులు సలుప। ధరణి మోరినగరవాస చింతా। వీరభద్రవరదుని మదిఁదలఁచుచు ॥రా॥

ద్వారపాలకుఁడు రాజునకుఁ కైవారముచేయుట.

సకలభూసుర బంధువందిమాగధ మంత్రిసామంత పరివృతా. పరాక్.

అనేకవిచిత్ర మణిఖచిత కాంచనమకుట కేయూరహారవిభూషణ భాసితా! పరాక్.

దయాసముద్ర చంద్రచూడరాజేంద్ర పరాక్.

మోరిపురాధీశ సర్వేశ పాదపంకజ మకరంద పానేందిందిరా పరాక్.

రాజు — మంత్రీ బుద్ధిసాగరా!

గీ॥ వేద్కఖిలంగ బ్రహ్మకు • వేదములను।
గఱపఁజాలెదు బ్రాహ్మణ • ఘనులువచన।
చతురత న్వాణినెదురింపఁ • జాలువిబుధ।
శేఖరుల్ సభనుండిరే • సిద్ధముగను॥

మంత్రీ! బ్రహ్మకైనను వేదములు గఱపఁజాలునట్టి వేదాధ్యయనాది షట్కర్మాచరణులగు బ్రాహ్మణోత్తములును వాక్చమత్కృతిచే వాణినైన నెదిరింపఁజాలు సకలవిద్యావిశారదులగు పండితశ్రేష్ఠులును మత్సభాస్థలికి వచ్చియున్నారుగదా

చంద్రి — సంతోషము.........బుద్ధిసాగరా

శీత షట్పది॥ చలమువహియించి క్షత్రియ • జాతినెల్ల।
వినువ కిరువదియొకమారు • వెదకిచంపి।
పుడమి రణశూరుఁడనికీర్తిఁ • బడసినట్టి।
పరశురాముని నెదిరించి • బవరమునను।
గెల్వఁజాలెడుభూపతుల్ • కేలుమోడ్చి।
వచ్చియున్నారె కానుకల్ • దెచ్చిసభకు॥

మంత్రీ! వేసారక యీశునధాత్రీశుల నిరువదియొకమాఱు వెదకి వెదకి చంపిన పరశురామునినైనను దురమున నోడింపఁజాలు దోర్దండచండ విక్రమోదారులగు మగధ మాళవ నేపాళ, పాంచాల యవన, బర్బర, కాశ్మీర, ఘూర్జర సౌరాష్ట్ర, వంగ, కళింగాది దేశాధీశులు తమతమ కప్పములనర్పింపఁ దప్పక మత్సముఖమునఁ గాచియున్నారుగదా

బుద్ధి — చిత్తము దేవా! మీయాజ్ఞానుసారంబుగ నఖిలదేశాధీశులుఁ దమదర్శనముకై వేచియుండిరి

చంద్ర — మహాసంతోషము......అమాత్యశేఖరా!

గీ॥ ధనదుఁడని పేరుమాత్రినఁ • దనరెఁగాని।
మిత్రుఁడగు శివుభైక్షక • వృత్తిమాన్పఁ।
జాలఁడాయెను ధనదుఁడిం • కేలయనుచు।
నవ్వువైశ్యోత్తములు వచ్చి • నారెసభకు॥

ధనపతియని పిలువంబడి తనప్రాణసఖుఁడగు శివుని భైక్షకవృత్తి మాన్పంజాలక పేరుమాత్రినఁ బ్రసిద్ధుండగు కుబేరుని ధనమొక ధనమాయని యతనిసంపద నపహాసింపుచు సారెకుమీఱిన వ్యాపార లాభంబుచే నపరిమితధనము సంపాదించి శ్రీరమణులై వర్తించు వైశ్యోత్తములెల్లరు మత్సభాస్థలికి వచ్చియుండిరిగదా

బుద్ధి — చిత్తము వచ్చియుండిరి దేవా!

చంద్రి — క॥ నెమ్మిమెయి బ్రాహ్మణాదుల।

కిమ్మొగఁబరిచర్యసల్పి • యీపురమున సే।
ద్యమ్ములు చేయుచు మిగుల సు।
ఖమ్ముగ జీవించు చుండ్రి • గదశూద్రిజనుల్॥

సచివాగ్రణీ! బ్రిహ్మ క్షత్రియ వైశ్యులకు సేవలుచేయుచుఁ ద త్తత్పక సస్యాదుల నొప్పుగాఁబండించుకొనుచు సుఖోపజీవితులై శూద్రిలు క్షేమంబుగ నున్నారుగదా!

ద్వా — దేవా! ద్వారముకడ నొకమునివరుండు మీదర్శనార్థులై వేచియుండె సెలవయినచోఁ బ్రవేశ పెట్టెదను.

చంద్రి — శీఘ్రిముగాఁ బ్రివేశ పెట్టుము.

(దూర్వాసుఁడు ప్రివేశించుట)

దరువ్వ — ఆది — నాదనామక్రియ.

వెడలివచ్చెను, దూర్వాసమౌని ॥వె॥ వెడలెనిడుదలగు జడలుశిరంబున ముడినిడి యుడుపతి చూడునికొల్వుకు ॥వె॥ దండకమండల ధరుఁడై భసిత త్రి॥ పుండ్రిములను మెయినిండఁదాల్చియును ॥వె॥ అడుగడుగునకుఁబంచాక్షరి నుడువుచు। వడివడి జపతావళమును ద్రిప్పుచు ॥వె॥ ధరణిమోరి పురధాముని సర్వే॥ శ్వరునిమనంబున మఱువక తలఁచుచు ॥వెడ॥

చంద్ర — క॥ వందసముచేతు మీకా।
నందముగా మునికులేశ • నాయెడఁ బ్రేమం।
జెంది యిటకరుగుదెంచితి।
రిందుకు ధన్యుండనైతి • నీఁకమునిచంద్రా।

ఓమునికులసార్వభౌమా! పదివేల వందనములు. మీరీసింహాసనమలంకరింపుఁడు.

దూ — క॥ వర్ధిల్లు రాజపుంగవ।
వర్ధిల్లు శశాంకవంశ • వారిధిచంద్రా।
వర్ధిల్లు సుజనసేవిత।
వర్ధిల్లుము చంద్రచూడ • వసుమతినాధా॥

రాజా! ప్రాజ్యరాజ్య సామ్రాజ్య వైభవోపేతుఁడవై యభివృద్ధి బొందుము.

చంద్ర — క॥ అయ్యా మీనామంబును।
జయ్యన నెఱుగంగఁ జేసి • సత్కారుణ్యా మీ।
రియ్యెడ కరుదెంచినపని।
యెయ్యదియో తెల్పుడయ్య • యేర్పడనార్యా

మునిసత్తమా! మీనామంబెయ్యది? మీ రేకార్యమునకై యిటకు వచ్చితిరి? మిమ్ముఁజూడ సాక్షాచ్ఛంకరునివలెఁగాన్పించుచుంటిరి, మీ సమాచార మాద్యంతము విన మిక్కిలి వేడుకపుట్టుచున్నది. వేగ మానతిండు.

దూర్వాసుని దరువు — ఆది — నాదనామక్రియ.

వినుచంద్రిమ డ। వీనులకింపుగ ॥విను॥ అనఘునా పేరు దూ। ర్వాసమౌనియందురు ॥విను॥ అవనీశనికడకు। నరుగుదెంచినపని। సవినయముగాఁ దెల్ప। సమకట్టి వచ్చితి ॥విను॥ ఈపూటభిక్షమీ। రిడినఁబక్వముచేసి। సాపడిమెదనయ్య సంతుష్టిగీరఁగ ॥విను॥ ధారుణి మోరిపుర। ధామున్ జైనట్టి చింతా। వీరభద్రవరదుని। వేఁడుచుందును మదిని ॥విను।

చంద్రిచూడా! నేనుదూర్వాసుఁడను పేరుఁగలవాడ బిక్షార్థమై యిచ్చటికరుదెంచితి మీరీదినమున బిక్షదయచేయించినచో రుచ్యముగఁ బక్వపఱిచి తృప్తితీర భక్షించి సుఖించెద.

చంద్రి — ఎవఁడురా అక్కడ

ద్వా — ( ప్రవేశించి ) దేవా! సెలవేమి?

చంద్ర — ఈమౌని పుంగవుని బిక్షకుందగు పదార్థములెల్ల శీఘ్రముగఁ దీసికొనిరమ్ము.

( ద్వారపాలకుఁడు నిష్క్రమించి పదార్థములతోఁ బ్రవేశించి చంద్రిమాడునితో )

ద్వా — దేవా! మీయాజ్ఞప్రకారము పదార్థములఁ దెచ్చి

తిఁ గైకొనుఁడు.

చంద్రి - (లేచ్చుకొని)

దరువు - ఆది - అసావేరి.

మునినాథా మీరుకో। రిన బిక్షఁదెచ్చితి। గొనినన్ను మిగుల ధ। న్యనిఁజేయుము దూర్వాస ॥ము॥

దూ — జననాథా నిన్నుఁజూడనా। కనుమాన మంకురించెఁ దనయులెందరో తెల్పు। వినిమెదఁ జంద్రిమూడ ।జన॥

చంద్రి— వింతగా పుత్రివిషయ। మింత తర్కింపనేల। సంతానహీనుండనైతి। చింతించుచుంటిని ॥ము॥

దూ— హరహర నేనీదినమీ। యపుత్రికుని గృహమున। కేలఁగికవచ్చితి। నేమిసేయుదు దైవమా ॥జన॥

చంద్రి— వచ్చెమహాత్ముఁడని। మెచ్చిబిక్ష మొసఁగిన। నచ్చెరువొందియు న। న్నగడు చేసెద రేల ॥ము॥

దూ— పుత్రిహీనునిచేఁ బిక్షఁ। బొందుట ధర్మముఁకాదు। ధాత్రిశ్రీ మోరిపుర। ధామునిసాక్షిగ ॥జన॥

ద్విపద। వినుచంద్రిమూడ భూ ♦ విభువర నేఁడు। తనయులు లేని ♦ తగవచించితివి। గనుక బిక్షనుబట్టఁ ♦ గాఁజాల నేను। పనివడియొక వేళఁ ♦ బట్టితినేని। ఘన నరకంబులఁ ♦ గములుచునుందు। ననుఁగృపజూడుము ♦ నరనాథవేగఁ। బోయెదనింకొక్క ♦ భూమీశుకడకుఁ। బాయని క్షుద్బాధఁ ♦ బాపుటకొఱకు॥

రాజా! మీరలపుత్రికులగు కారణంబున మీరిచ్చు బిక్ష గైకొనుట ధర్మముకాదు. ఒకవేళఁ గైకొన్నచో రౌరవాది నరకముల కర్హుఁడనయ్యెద కావున వేరొక భూమీశుకడకుఁ బోవుచుంటి (అనిపోఁబోవును)

చంద్ర— (అపి కాళ్ళపైఁబడి)

దరువు - అట - అసావేరి.

మునినాధానాకుఁ బు। త్రిలుగల్గెడిమార్గ। మునుదెల్ప నినువేడెద॥ అనఘమదీయపూర్వ। జన్మదుష్కర్మము। లనుభవించుచునుంటిఁగా॥

నేఁజేసెడికార్య। మేమొసత్వరముగ। నెఱిఁగింపుముదేవా॥ నాజన్మసా ర్థక। మగుకీర్తి నీవిచ్చ। డాదరించిప్రోవవా॥ పరమాత్మ నీవునా। పాలభర్గుఁడవని। భావింపుచునుండుఁగా॥ ధరణిలోశ్రీమోరి। పురధా ముఁడగుసర్వే। శ్వరుఁ డైనదయజూడఁడుగా ॥ము॥

మునీంద్రా! పుత్రహీనుండనగు నాకుఁ బుత్రులుద్భవించు మా ర్గమెఱింగించి పవిత్రునిగాఁ జేయుఁడు

దూ — గీ॥ భూతలేశ్వర! శివుఁగూర్చి • భూరితపము।
చేయనినుమెచ్చి కరిచర్మ • చేలుఁడపుడు।
సుతునిదయచేసి బ్రోచును • సుగుణవర్య!
పొమ్ముతపమునుజేయ శీ • ఘ్రమ్ము వనికి॥

రాజా! యిటురమ్ము (అని చెవిలో నేదియో చెప్పి) నేఁజెప్పిన యీమంత్రముచే భూతదయాపరుండగు శంకరునిగూర్చి తపంబొనర్చి నఁ బ్రత్యక్షముగవచ్చి సంతానమొసంగును కావునఁ దపముజేయుట కరణ్యమునకుఁ బొమ్ము. నేనుభిక్షార్థమై వేఱొకచోటున కేగెదను

చంద్ర— చిత్తము నాపాలిటి భగవంతునివలె వచ్చి నాకీ మార్గముపదేశించిన పరమాత్ములరగు మిమ్మెప్పుడు మఱువక స్మ రియించుచుందును నాయందు పరిపూర్ణ కటాక్షముంచుఁడు.

దూ— (నిష్క్రమించును.)

చంద్ర— (విచారించుచు మంత్రితో)

దర్వు — అట — ఖీల్వా

అవనిలో నావంటి యతినిర్భాగ్యవంతు। లరయనెందునఁ గలరా॥ నేఁరయనెందునఁ గలరా ॥అ॥ ప్రవిమలమగురాజ్య। పదవిఁగల్గియును సు తులఁ బడయుయోగ్యత లేదుగా। సుతులఁ బడయుయోగ్యత లేదు గా ॥అ॥ పరగదూర్వాసమౌని వరుఁడువచ్చియు భిక్ష। పాత్రముగాద నియెఁగా। భిక్ష పాత్రముగాదనియెగా ॥అ॥ ధరమోరి పురసర్వే। శ్వ రుని వేఁడినపుత్ర వరునిచ్చునని పల్కెఁగా ॥అ॥

బుద్ధిసాగరా "అపుత్రస్య గతిర్నాస్తి" యనునార్యోక్తి ననుస

రించి పుత్రహీనుఁడ నగుటచేతనేకదా భిక్షార్థమై యరుదెంచిన దూర్వాసఋషి భిక్షగైకొనక నిష్క్రమించె కటకటా! నావంటి యధమాధముం డెందైనఁ గాన్పించునా? సకలరాజ్య వైభవములుండియు సంతానరహితుండైన మానవునిజన్మ మొకజన్మమా, అదియునుం గాక

చ। కనకము లేని భాగ్యమును • గన్నకుమారుఁడు లేని సౌఖ్యముం।
విసఁజవిగాని పాటయును • విత్తములేని ప్రయత్న కార్యముం।
వినయము లేని భక్తియు వి • వేకముమాలిన వాని వైద్యముం।
గసనివి నిష్ఫలంబులగు • గాయము తాకిన బంటుకైవడిన్॥

మంత్రీ! బుద్ధిసాగరా! బంగారంబులేని భాగ్యమును, పుత్రులులేని సౌఖ్యమును, ఇంపుగాని పాటయు. ధనములేని కార్యమును. నీతిలేని భక్తియుఁ దెలివిమాలిన వాని వైద్యమును వృద్ధిఁ బొందక వ్యర్థముగాఁ జెడిపోవును. కావున నాకు దూర్వాస ఋషివరుం డుపదేశించిన రీతి నిహపరసౌఖ్య సాధనంబగు సంతానంబుఁ బడయుటకై యరణ్యమున కేగి ఘోరంబుగ హరుని గూర్చి తపంబొనర్చెద నేవచ్చువఱకు మనరాజ్యంబెల్లఁ జక్కఁగఁ బరిపాలింపుము.

బుద్ధి— చిత్తము. మీయాజ్ఞప్రకార మీయామోద పట్టణంబెల్లఁ బాలించెద.

(రాజరణ్యమున కేగుట.)

దర్వు – ఆది – సావేరి.

తరలె (జంద్రహాసుఁడు। తపముఁ జేయనడవికిఁ ॥దరలె॥ తరలె భర్గుని పాదసరసీజముల పూజ। మఱువక చేయఁ దలఁచి మహాదేవశంభూయనుచును ॥తరలె॥ కరమురుదుగనా పురహరుని వేఁడినఁ గరుణతోడుత పుత్రవరునిచ్చు నంచుమెచ్చుచు ॥తరలె॥ ధరణిలో శ్రీమోరిపుర ధాముఁడైన సర్వే। శ్వరుఁడే రక్షించినన్న సత్పాత్రుఁ జేయునంచు ॥తరలె॥

(ఇట్లరణ్యంబుఁ బ్రవేశించి యచలమనస్కుఁడై శంకరునిఁగూర్చి)

దరువు – రూపకము – భైరవి.

ఈశా నీ మహిమ నెఱుఁగ నేరికివశమగును పార్వ ॥తీశా॥ ఆశతో నీ పాదాబ్జము లాశ్రయించి యుంటిని నన్ను। లేశముగాఁ జూడవలదు। కేశవనన్నుత జగ ॥దీశా॥ మూఢబుద్ధినున్న నాబోటులకు నీగుణాళి। గూఢముగనుండుఁ గాని రూఢియేర్పడదు చూడ ॥నీశా॥ పాపనాశ భవవినాశ ఫాలనేత్ర భక్తపోష। నీపదములె మదినిడుకొని। నిరత ముస్మరియించుచుంటి ॥నీశా॥ వాసిగ శ్రీ మోరిపురనివాస చింతావీరభద్ర దాసపోషకుండగు సర్వేశుఁడవని నమ్మియుంటి ॥నీశా॥

దేవహారము.

పురహార! పార్వతీశ! ♦ భుజఁగభూషణ! మహేశ!
గిరివరజా కళత్ర! ♦ గీర్వాణ నుతచరిత్ర!
పరమ కారుణ్యసాంద్ర! ♦ భర్గ! కోటీరచంద్ర!
మరువనీ నామస్మరణ ♦ మారగర్వాప హరణ!

తురంగప్రయాతము.

గరళకంఠ! వామదేవ! ♦ కాలకంధరా! శివా!
హర! గిరీశ! యభ్రకేశ! ♦ యంబుజార్చితా! భవా!
పురహర! త్రినేత్ర! మాని ♦ పూజితాంఘ్రి నీరజా!
పరగ నన్నుఁ బ్రోవుమయ్య ♦ పాపనాశనా! మృడా!

దరువు – ఆది – శంకరాభరణము.

శ్రీరామలింగ। సితాంగా। గంగోత్తమాంగ ॥శ్రీరా॥ మారమద భంగగౌరి సంగమార్కండేయ వరద మహిశతాంగ ॥శ్రీరా॥ పటుతర త్రిపురదనుజహారశశిధర। పరమపావని సత్తమసుచరణా। నిటలనయన పటురిపుగణభీకర। నిగమవేద్య నిర్జరాళిపూజ్య ॥శ్రీరా॥ మురహర వినుతకలుషహరశివశం। కరరజతాద్రివిహార సుధీర ఉరగభూష హేమాద్రిశ సన వరచింతా వీరభద్రపోషణ శ్రీరామ।

(అంతశివుఁడు చంద్రహాసునకుఁ బ్రత్యక్షమగును)

దరువు — ఆది — రేగుప్తి.

హరుఁడు ప్రత్యక్షమయ్యెనపుడు। చంద్రిమాఁడునకుఁ బుర ॥హరు॥ హరుఁడు ప్రత్యక్షమయ్యె హరిణాంకమకుటధరుఁడై। యురగాభరణములు కర్ణకరమస్తకములఁ దాలిచి ॥హ॥ వేఁడుక పుట్టఁ జంద్రిచూడఁ డొనరించుఁ దపముఁ జూడ మదినెంచి పార్వతిఁ తోడ వృషభంబునెక్కి ॥హరు॥ మును భక్తులెవ్వరైన నన్ను నీవిధమున। సన్నుతిఁ జేసినవా। రున్నారె యనుచు మెచ్చుచు ॥హరు॥ ధరణిలో శ్రీమోరిపురమున వెలసియు। వరచింతా వీరభద్రివరదుఁడైనట్టి త్రిపుర ॥హ॥

చంద్రి — (హరునిఁగాంచి)

ఉ॥ దండము సేతునయ్య గజ ◆ దానవభంజన। పాపనాశ। యా।
ఖండలుఁడాది గాసురలఁ ◆ గాచిన భూతదయా సముద్ర నీ।
యండను జేరియుక్ మృదుప ◆ దాబ్జములన్ మదినిల్పి భక్తిచే।
దండిగఁ బూజసల్పితిని ◆ దండము గైకొని ప్రోవవే శివా।
కాలకంధరా! నమస్కారము.

శివు — క॥ వర్ధిల్లు దీనపోషణ।
వర్ధిలుము చంద్రిమూడ వసుధాధిపతీ।
వర్ధిల్లు శూరవేష్టిత।
వర్ధిల్లుము తుహినధామ వంశలలామా।

ఆయురారోగ్యైశ్వర్యయుతుండవై యభివృద్ధి పొందుము.

చంద్రిమాఁడుని దరువు — ఆది — తోడి

నిన్ను నమ్మితి నీశా సర్వేశా। నన్నుఁ బ్రోవు పన్నగభూషణ ॥నిన్ను॥ చింతదీర్చరాని చెంతఁజేరితిరా। కంతుహర వేగఁ గరుణఁజూడర ॥నిన్ను॥ పాపాత్ముఁడని కోపమెంచకనా। పాపముదుంచి పాలించు జగదీశ ॥నిన్నే॥ నిగమాంతవేద్య సిద్ధరాశిపూజ్య। నగజాకళత్ర నగధరమిత్ర ॥నిన్ను॥ మోరిపురవాస మొక్కెదను చింతా। వీరభద్రదాస వినుతసిద్ధవిలాస ॥నిన్ను॥

పార్వతీశ్వరా! మీపాదారవిందములనేక దినంబులనుండి పూజిం

పుచుంటినని నాయందనుగ్రహముంచి నేఁటికి దర్శనమిచ్చితిరి ఇఁకనన్న ధన్యుని జేతురని మిక్కిలి నమ్మియుంటిని.

— శివుని కందార్థము. —

జననాథనీవొనర్చిన। ఘనతరమగుతపముఁ జూడఁ ♦ గడుముదము నయ్యెఁ। మనమున సంశయమొందక। ననువేఁడినకార్యమేమి ॥నరజ నరత్నా। తెల్పుము సుజన హితధర్మదీక్షా॥ అతిశీఘ్రముగ నిత్తునడుగు మేవరమైన। మతినూహించియు రాజ మార్తాండ సమతేజ ॥స॥

రాజా! నన్నుఁగూర్చిచేసిన యీఘోర తపంబునకుమిగుల సంతసించితిని నీకేవరమందిచ్చగలదో శీఘ్రముగ వాకుృచ్చుము. అది యెట్టిదియైన మానక యొసంగెదను

— చంద్రహాసుని కందార్థము —

పుత్రులు పుట్టని కతమున। ధాత్రిని నపవిత్రునైతిఁ ♦ బగుజనముల లోఁ బాత్రుని జేయుమునాకొక పుత్రుని దయచేసి సకల ॥భూతశరణ్యా। కోరితి వరము పాతకహరణా। యీతరుణమందు నాకిది మాత్రమొసఁగియుఁ జేతోమోదము నొందఁజేయుము శంకర ॥భూ॥

పార్వతీశ్వరా! పుత్రహీనుండనైన నాసరివారలలో మిగుల నిందనియుండనగు నాజన్మము పవిత్రమయ్యెడి కుమారునొకని నిచ్చి రక్షింపుఁడు.

శివు— రాజా! నీపూర్వకృతకర్మము విచారించిచూడ నీజన్మమునఁ బుత్రహీనుండవై యిహపర సౌఖ్యంబులకర్హుండవు గాకయుందువు. అయినను నన్నుఁగూర్చిచేసిన యీతపంబునకు మెచ్చి నేనొకటి చెప్పుచుంటి నాకర్ణింపుము.

ద్విపద। వినుమయ్యరాజేంద్ర ♦ విశదంబుగాను తనయునిమ్మని నీవు ♦ తగఁగోరినావు గనుక నేఁ జెప్పెదఁ ♦ గగుణాపెంపార। ఘనుడు సుజ్ఞానుం ♦ గడుసుందరుండు। నై వెలుఁగొందు న ♦ ల్పాయుష్యయుతుఁడు। కావలెనాలేక ♦ కఠినుఁడు మొఱకుఁ। జెనటియునగుచు వి ♦ శేషకాలంబు మనెడునాత డుకావ ♦ లెనయూహఁజేసి చెచ్చెరఁ

జెప్పుము • చేతోముదమున। నిచ్చెదనిప్పుడే • యినసమ తేజ॥

రాజా! ఘనుడును, సుందరుఁడును, జ్ఞానవంతుఁడును, నగుసల్పాయుష్కుఁడు కావలయునా? లేక మూఢుఁడై నీచుడై మత్తుఁడై యుండు దీర్ఘాయుష్యవంతుఁడు కావలయునా? వీరిలో నీకిష్టమగువారెవ్వరో తెల్పుము. వానినే యిచ్చెదను.

చంద్రి— ఆ॥ వె॥ బుద్ధిహీనుఁడైన • పుత్రుఁడు చిరకాల।
ముండిన ఫలమేమి • యురగభూష।
సుగుణవంతుఁడయ్యు • సురుచిర తేజుండు।
నగు సుపుత్రి నొసఁగు • మార్యవినుత॥

పార్వతీశా, బుద్ధిహీనుఁడగు కుమారుఁడు విశేషకాలముజీవించి యున్నను వానివలనఁ బ్రయోజనమేమి? సుగుణవంతుఁడు తేజోరూపవంతుఁడునగు కుమారుఁడు కులమునకు ఖ్యాతిఁదెచ్చును. కావున సకలవిద్యావిశారదుండు కాఁగల సత్పుత్రినే దయసేయుఁడు.

శివు— రాజా! నీయభీష్ట ప్రకారము తేజోవంతుఁడు, ఘనుఁడునగు సల్పాయుష్య వంతుఁడు నగఁగా పదిరెండు దినములు జీవించి నీజన్మముఁ బవిత్రముఁ జేయు కుమారునే యిచ్చితిని.

రాజు దర్వు – రూపకము – ముఖారి.

అయ్యయ్యో పదిరెండు దినములాయువుగల బాలునిచ్చితి ॥రయ్యో॥ ఇయ్యెడ నేనేమి సేతునెటుల సైఁతు నీశ్వరా ॥అయ్యో॥ అవగుణుఁడో సద్గుణుఁడో యంతలోనెయెట్లు తెలియు॥ నవమాసములు మోసికన్న నాతికష్టమెటులఁదీరు ॥నయ్యో॥ ఇంతవఱకు సుతులకొఱకుఁ జింతఁజేసితిఁగాని యిప్పుడంతకన్న నతిశయమగు వంతకులోనాటగాదె ॥అయ్యో॥ వాసిగాశ్రీ మోరిపురని। వాసచింతా వీరభద్ర దాసునిరక్షించునట్టి దైవమవనివేఁడుచుంటి ॥నయ్యయ్యో॥

అయ్యయ్యో పార్వతీశ్వరా! పదిరెండు దినంబులాయువుగలవాని సుగుణ దుర్గుణములెట్లు తెలియును? నవమాసములు గర్భభరంబు వహించి కడువారఁ గన్నతల్లి కష్టమెట్లు బాయును? కటకటా! ఇది

వఱకుఁబుత్రులు లేరన్న విచారముకన్న నెక్కుడగు గర్భశోకము నయితముకలుగఁ జేయయత్నించితిరే? కటకటా, నేనెంతపాపి నైతిని నన్నీ దుఃఖసాగరమున బడఁద్రోయ న్యాయమా? నాయందుఁ గరుణగలవారై మీరిచ్చిన పుత్రునకు దీర్ఘాయువిచ్చి రక్షింపుఁడు.

సంవాదసీసము,

శివు— పుత్రులు లేరని ♦ భూరితపము చేయ
మెచ్చి పుత్రునినొక్క ♦ నిచ్చినాఁడ।
చంద్రి— ఇచ్చినఫలమేమి ♦ యీశిశువునకిన
దినములాయువటంచుఁ ♦ దెల్పినారు।
శివు— మున్నె నీయభిమత ♦ మునుగొని యిచ్చితి
నిందుకుఁ గొఱఁతేమి ♦ యిందుకులజ।
చంద్రి— కొఱఁతగలదని చెప్పఁ ♦ దరముగానటువంటి
గర్భదుఃఖముకూడఁ ♦ గలుగనయ్యె।
శివు- వంతయుడిగి మనంబున ♦ సంతసించు।
చంద్రి- సంతసంబెల్లు గలుగు మీ ♦ రింత సేయ।
శివు ఇచ్చినవరంబెటుల మఱ ♦ లించగలను।
చంద్రి- సర్వసిద్ధులరగు మీక ♦ సాధ్యమెద్ది॥

సర్వజ్ఞులరు భక్తవత్సలులరునగు మీకెఱుఁగనిదేమున్నది. దీనుఁడనగు నాపైనింత కాఠిన్యముఁ బూనవలయునా? ఎట్లయినఁ గరుణించి మీరిడిన బాలునకుఁ బూర్ణాయువొసఁగి కాపాడుఁడు.

శివు— రాజా. నేనాదిని నిరూపించి చెప్పిన వారిరువురిలోను నీయభిమతమునకు సరిపడిన బాలునే యిచ్చితి. ఇఁక నన్నుఁ గూర్చి వేఱఁగోరవచ్చునా?

చంద్రచూడుని దర్వు — ఆది — ముఖారి.

గిరిజావరశంకర నా మొఱవిని। కరుణించెడు వారెవరింకఁ। బరమదయా। కరుఁడవని। మఱువక తలఁచితి నయ్యయ్యో ॥గిరి॥ వరమొసఁగిన సుత వరునకు నాయువు। పరిపూర్ణముగా నిమ్ము హరా। ఉరగ

ధరా। వరగుణనా। తరముగానివ్యథమాన్పుమయా ॥గిరి॥ కష్టముఁబాపియు నిష్టముఁదీర్చెడు। సృష్టికర్తవు నీవెకదా। కష్టుఁడనా। యిష్టసుతుఁ। నష్టముసేయకు మబ్బబ్బా "గిరి" ధారుణి మోరిసగరవాసుఁడవని। కోరిభజించితిఁ బాపహరా। చేరితిని। వేఁడుగన। న్నారయవలదయ్యయ్యయ్యో ॥గిరి॥

పరమేశ్వరా! విచారసాగరంబున మునింగియున్న నన్ను నీకృపయనెడు నావపై నెక్కించి తీరముఁ జేర్పకున్న నేనేమిచేయుదు. ఇదిగో మీశరణముఁ జొచ్చితి. మీ రెట్లుచేసినను జేయుఁడు (అనిశివుని పాదములపైఁబడును)

శివు— ఆహా! యేమి!

గీ॥ వీని ధైర్యవివేకితా • వినయగుణము,
లవనిభక్తుల కేరికి • నైనఁగలవె,
భక్తవత్సలుఁడను పేరఁ • బరఁగియుట్టి,
భక్తవరుఁగావకుండుట • యుక్తమగునె!

ఆహా! వీనివినయాది గుణములకు నామనం బమందానంద కందళితంబై యొప్పుచున్నయది. ఇట్టిపరమభక్తు నీతరుణమునఁ గాచిరక్షింపకున్న నాభక్తవత్సలనామం బెట్లుసార్థకమగును. రాజా! నీభక్తికి మెచ్చితి. నీసుతునకు దీర్ఘాయువుగల్గు నుపాయమొకటిఁ దెల్పెద విచారింపకలెమ్ము.

చంద్రి— (లేచి) మహాత్మా! అదియెట్టిదో శీఘ్రముగ నానతిండు.

శివు— నేనిచ్చినకుమారునకుఁ బదిరెండవదినంబునఁ బదిరెండువత్సరముల ప్రాయముగల కన్యారత్నమును బాణిగ్రహణము గావించినచో నాకన్యకుఁగల సుమంగళత్వంబున కుమారునకు సంపూర్ణాయువుకాఁగలదు. ఇదియే ముమ్మాటికి నమ్మియట్లుచేయుము. నీకుమారునకు మాత్రము చంద్రికాంతుఁడను నామధేయముంచుము. నేనునాస్థానమున కరిగెదను.

చంద్రి— చిత్తము. నన్నిప్పటికిఁ బవిత్రునిఁ జేసితిరి, నాయం
దు కరుణమాత్రి ముంచుఁడు.

{ అంత శివుం డంతర్ధానము కాఁగాఁ జంద్రిమూ
ర్తుఁడు పురిప్రవేశింప బుద్ధిసాగరుం డెదుర్కొని }

బుద్ధి— క॥ మీ రేగినకార్యంబిప్ర।
శ్రీకంఠగజరిగెవరము • లెయ్యవి గైకొ।
న్నారో శీఘ్రముగావినఁ।
గోరితిఁ దెలియంగఁబల్కు • కువలయనాథా॥

అయ్యా! మీరా పరమేశ్వరునిగూర్చి తపంబొనర్చి యే యేవరము
లఁ గైకొంటిరో మిక్కిలి విననాసక్తిగానుండె. వేగ మెఱింగింపుఁడు.

చంద్రిచూడుని దర్వు — అట — సారంగ

ఏమితెల్పుదు మంత్రివర్యా! కైకొన్న వరము ॥ఏమి॥ ఏమితెల్పు
దునయ్య కామగర్వాప హారు। నామము మదినుంచి। వేమారు స్మరి
యింప। నామహేశ్వరుఁడాత్మ నలరియుఁ। శ్రీమమున వృషభంబు
నెక్కియు। హైమవతి నర్ధాంగమునని డి। సోమచూడుం డగుచువచ్చె
ను ॥ఏమి॥ వచ్చి నాభక్తికి। మెచ్చి మనమున। కిచ్చవచ్చినవర। మిచ్చె
ద వేఁడుమన। సచ్చరిత్రుండైన పుత్రుని। జెచ్చెరం దయసేయుమన
గా। నిచ్చియును శిశువునకునాయువు। దచ్చి చౌదివసంబులనియెను
॥ఏమి॥ అనఁగామనమున దుఃఖ। మును జెంది పూర్ణాయు। వును నిచ్చి
సుతుఁబ్రోవు మని ఘనముగ వేఁడ॥ నినదినంబుల లోవుగా బా। లు
నకు ద్వాదశ వర్షములయం। గనను వైవాహికముఁ జేసిన। మునును దీ
ర్ఘ కాలమనియెను॥ ఏ చేసినతొలిబాము। దోసములీకనిన్నుఁ। బా
సిపోఁగలవు శ। భాసటంచును దెల్పి॥ వాసి శ్రీ మోర్రిపురో ని। వాస
చింతా వీరభద్రి దాసవరదుండప్పు డే కై।లాసనగముననుఁ జేర నేగెను ॥ఏ॥

మంత్రి— నరణ్యమున కేగి యచ్చట హరునిగూర్చి విశేషకా
లము తపంబు సేయ నాతండు సాక్షాత్కరించి యెద్దియేని వరము వే
డుమన పుత్రుని నుచేయుమంటిని. అప్పుడు శంకరుఁడు "దీర్ఘ

యుష్య వంతుఁడు మూఢుఁడుకావలెనా? అల్పాయుష్యవంతుఁ డ
ఖండుకావలెనా" యన సుగుణవంతునే దయసేయుమంటిని. నీయ
ష్టము ప్రకారము సుగుణవంతునే యిచ్చితినిగాని యాయువు పదిరె
డు దినములని శివుఁడు సెలవొసంగ నేను విచారగ్రస్తుండనై శంకరుని
తో, బాలుని పూర్ణాయువుకొఱకు మొఱ పెట్టుకొనఁగాఁ గరుణాక
వాఁడై యాశిశువునకుఁ బండ్రెండవ దినంబునఁ బండ్రెండువత్సరము
ల ప్రాయముగల కన్యారత్నమును వివాహమ్ముఁ గావించినచోఁ బూ
ర్ణాయువు తప్పక కాఁగలదనియు, వానికిఁ జంద్రికాంతుఁడని నామధ
యంబుంచుమనియు, వాక్రుచ్చి యదృశ్యుండయ్యె. అప్పటినుండియు
నామనంబుననొక విధంబయిన విచారం బంకురించినది.

బుద్ధి— గీ॥ దీనికింతటి వగఁజెంద • నేనెమీరు!
భూతనాథుండు ముల్లోక • పూజ్యుఁడైన!
శివుఁడు మీయందుఁ గరుణచే • జెప్పినట్టి!
పల్కు వృథయానె సాఁగక • పార్థివేంద్ర॥

దేవా! దీనికై యింతవిచారింపనేల? త్రిలోక పూజ్యుఁడును భూ
తదయాపరుఁడును, నగు శంకరునివాక్యము లుడివోవునా? మీరిప్పటికి
పవిత్రులరై తిరి. ఇఁక మీరు విచారముమాని సంతసంబున నంతఃపుర
బునకు నేగుఁడు. (నిష్క్రమింతురు)

(ఇట్లుపోయి రాజుకొంతకాలము భార్యతో నిష్టాగోష్ఠిగానుం
డ దైవానుగ్రహమున భార్య గర్భవతియయ్యె నంత రాజొక్కనా
డు నిండుకొలువై యున్న సమయంబున భటుఁడొకఁడు ప్రవేశించి

భటు— దేవా? జయమగుఁగాక
చంద్రి— ఏమిరా నమాచారము.
భటు— దేవా? యి దినమున మీకుఁ దేజోవంతుఁడగు
క్కనికుమారుం డుద్భవించె. తేయవార్తఁ దమకెఱింగింపవచ్చితి.
చంద్రి— (మంత్రినిఁజూచి విచారముతో) అక టామంత్రి
సుతుఁడు ఫుట్టెననఁగాఁ బూర్వముకన్న నెక్కుడగు దుఃఖము నామ

రంబున నుదయించుచున్నయది

సంవాద దరువు — అట — జాలికాంభోది.

చంద్రి— సుతులు లేకిదివఱకు। మతిఁగుందుచుంటిని మంత్రివ ర్యా। యిప్పుడతులితముగదుఃఖ। మావహిల్లెనయ్య మంత్రివర్యా॥సు॥

బుద్ధి— ఇంతమాత్రపువనికే। వంతఁజెందనేల రాజరాజా। సుతునకు సంతసమునఁబెండ్లి। సన్నాహమొనరింతు రాజరాజా॥ఇం॥

చంద్రి— ధరిటిలో శిశువునకుఁ। బరిణయమెటులౌను మంత్రి వర్యా। నాకెఱుఁగఁజెల్పుము మదికి। నేమిఁతోఁచకయుండె మంత్రివ ర్యా॥సు॥

బుద్ధి— మండలాధిపులౌవిరా। దండఁబ్రధానినైె రాజరాజా। నే। నుండిమీసుతునకుఁ। బెండ్లిసేయఁగలే నే రాజరాజా॥

చంద్రి— ఎటులఁజేతువుకన్య। నెచటఁయోచించితివి మంత్రి వర్యా। నీ విటులఁబల్కుచు నుంటె। వేమి ధైర్యముగలదు మంత్రివ ర్యా॥సు॥

బుద్ధి— ధరణిలో శ్రీమొరి। పురసర్వేశ్వరుఁడెపుడు రాజరా జా। మనల సరసిఁ శుణసేయు। గొఱఁతెందుఁగలదయ్య రాజరాజా॥

ధైర్య భూధరులరగు మీరీవిషయమునకుఁ జింతింపవలయునా? త్రిజగద్రక్షకుఁడగు సర్వేశ్వరుఁడు మనలఁ బరిపూర్ణ కటాక్షము తో వీక్షించుచుండ నేకొఱఁతయు వాటిల్లదు అదియునుంగాక యీ విషయమై నాబుద్ధినైపుణ్యమెల్ల వినియోగించి యీకార్యము నెఱవే ర్పకున్న నేఁజేయుచున్నదొక మంత్రిత్వమా;

చంద్రిమాడుని గీతార్థము

అహాహా నీధైర్యవాక్యము ♦ లాలకింప। నంతరంగాన వింతయు ♦ సంతసంబు। నొక్కసారిగ నుదయించె ♦ నోయమాత్య। శేఖరాసూ నునకుఁబెండ్లి॥ చేసెదవెట్లు। ద్వాదశాబ్దముల చెలిపోసఁగుచెట్లు। ఈ శునికృపగన్య నిచ్చువారుండిన నేమాత్రమునవితరు లెఱుఁగకుండఁ గఁబెండ్లి॥చేసె॥

ఆహా! మంత్రీ! నీ ధైర్యవాక్యములు విన నాయంతరంగమున సం
తసంబును వింతయు నొక్కసారిగఁ బొడముచున్నవి. ఐనను పసిబా
లునకుఁ బండ్రెండు సంవత్సరముల కన్యనెట్లు పొసఁగింతువు. ఒకవేళ
పొసఁగినను వివాహముసమయమునఁ జరిఁగెడుచేతలెట్లు జరిగింతువు.
నాకిదియంతయుఁ దుష్కరముగఁ గన్పించుచున్నది. నీవెట్లుచేయద
లంచితివో శీఘ్రమెఱింగింపుము.

బుద్ధిసాగరుని ద్విపద.

వినవయ్య రాజేంద్ర ♦ విశదంబుగాను। ఘనుఁడు దైత్యేంద్రుఁడు ♦
కాంచనాపురికి। నధిపతి సింహకే ♦ తాహ్వయుండిపుడు। కుధరపుత్రి
కవల్లఁ ♦ గొన్నకూతునకు। పదిరెండువత్సరాల్ ♦ ప్రాయమటంచు।
ముదముతోడవివాహ ♦ మునుజేయనెంచి। సకలరాజులపట ♦ సమితిఁ
దెప్పించి। యకలంకుఁ డైతాను ♦ నరయుచునుండె। ననివింటినేనిపు ♦
డాతనికడకు। పనివ నాసుతుఁ ♦ బటమునువ్రాసి। మీకుమారుండని
♦ మిషఁబన్నివెళ్లి। ప్రాకటంబుగఁ బెండ్లి ♦ పద్ధతులన్ని। మాట్లాడివ
చ్చెద ♦ మఱి పెండ్లినాఁడు। ఎట్లుసేసెదవన ♦ నేనుపెత్తెశుపు। కంధరం
బునవాసి ♦ కథగలచీటి। ముందుగా గట్టియా ♦ ముద్దుబాలకుని। పెట్టె
లోనుంచియా ♦ సీటికనాడు పట్టిచేతికినిచ్చి ♦ పరిణయమందు। వరు
సకుసుమమాల ♦ వైచెడితఱిని। దరినున్నపెట్టెలోఁ ♦ దన దైవముం
డె। ననియుసీనికిమాల ♦ నర్పణసేయఁ। దనరకులాచార ♦ ధర్మంబు
మాకు। ననిచెప్పుమనిపెండ్లి ♦ నడుపుదునయ్య। జననాథనాకింకఁ ♦
జనసెలవిమ్ము ॥

దేవా! కాంచనాపురంబేలు సింహకేతుండను రాజు చండికావర
ప్రసాదంబునఁ గాంచిన తనకూఁతునకు ద్వాదశాబ్ద ప్రాయమువచ్చి
నదనియు వివాహము తప్పక యీమాసమునఁ జేయవలయుననియు
నిశ్చయించి సకల దేశరాజకుమారుల పటములను జారులవలనఁ దె
ప్పించుచుండెనని యిదివరకే వినియుంటిని. కావున నిప్పుడా రాజుకడ
కు నేనేగి నాకుమారుని రూపపటమును మీకుమారుని పటమనిచెప్పి

యాతనికూఁతు నిష్మ్రందును. అట్లతఁడిచ్చుట కొడంబడిన పిదప మీ కుమారుని కంఠమున నతనివృత్తాంతముగల చీటిఁగట్టి యాబాలునొక పెట్టెయందిడి యాపేటిక నాకుమారుఁడగు చంద్రసేనుని చేతికిచ్చి వివాహసమయంబునఁ బెండ్లికుమార్తె వరునకుఁ బువ్వుమాల వేయు తఱి నీమందసమున మాయిష్టదైవముండెననియు నామాలిక పెట్టె యందిడుట మాకులాచార ధర్మమనియుఁ జెప్పి యట్లు సేయించెదను. దీనికి మీరియ్యకొని నాకు వైశంబసెలవొసంగుఁడు నేఁబోయివచ్చెద.

చంద్ర— మంత్రీ! నీయుక్తికిఁ జాలసంతసించితిని. కాని పరులను మోసమొనర్చిన మనకు దోసముకాదా?

బుద్ధి— దేవా! యిది దోషమైనచో మనకు శంకరుండీరీతి నెందుకు వరంబిచ్చును కార్యవిషయమై మానుష ప్రయత్నం బించుకయుఁ జేరకున్న నెఱవేఱునెట్లు?

చంద్ర— అట్లయిన మనప్రయత్నములు బహుగుప్తముగా నుంచి యట్లుసేయుము. నేను నాయంతఃపురంబునకుఁ బోవుదును.

(అని నిష్క్రమించును. మంత్రియు నిష్క్రమించును)

(అంతఁ గాంచనాపురాధీశుండగు సింహకేతుండు మంత్రులతోఁ బ్రవేశించుట.)

దరువు - ఆది - సావేరి.

సింహకేతు దనుజేంద్రుఁడు విక్రమ। సింహుఁడనఁగ వెడలెఁదన దుసభకును ॥సిం॥ సింహశతంబుల మార్గా ని దురముగ। సంహరింపఁ జాలు బాహుబలుఁడన ॥సిం॥ వదనమరయఁగ హి। తాహితులకు స। మ్మదము ఖేదమొదవ। మదమునమై యొఱుఁగక తిరుగురిపుస। మూ జంబుల గర్వమణఁపఁ జాలెడు ॥సిం॥ కోటిభాస్కర ప్ర। దీప్తి హసించు కి। రీటమునుధరించి। వాటములగు బాహుపురులు బాహుల। నీటు మీఱఁదాల్చి సంతసంబున ॥సిం॥ వారకభటు లిరుగడలనిలిచి కై। వారములనుజేయ॥ మీఱినగరవాసుఁడైన చింతా వీరభద్రవరదుని మదిఁదలఁచుచు ॥సింహ॥

— భటుఁడు సింహకేతునకుఁ జైవారము సేయుట. —

సర్వదానవమానవ సంస్తూయమాన స్వభావప్రభావా! పరాక్.

అఖిల బంధువందిమాగధ మంత్రిసామంత పురోహిత పరివృతా! పరాక్.

సర్వమంగళా పాదసరోజాత మకరంద పానేందిందిరా! పరాక్.

నవరత్నస్థగిత కాంచన సింహాసనాసీనా! పరాక్.

సింహ— విద్యున్మాలి, విరూపాక్ష, వికచలోచన ప్రధానులారా యిప్పుడు విద్వజ్జన, కవి, గాయక, నర్తక, పాఠక, వైణిక, వైతాళిక, పరిహాసక, చార, భటానీకంబులును, మంత్రి, సామంత, పురోహిత, వేశ్యాజనంబులును సభాస్థలికి వచ్చియున్నారుగదా?

మం— మీయాజ్ఞానుసారంబుగ నందఱు కొలువునకు వచ్చియేయున్నారు.

సిం— సంతోషము. సంతోషము......మంత్రులారా!

ద్విపద॥ అంగకళింగాంధ్ర • యవనకాంభోజ। వంగబర్బరపాండ్య • పాంచాలనాట। మాళవనేపాళ • మగధభూపాళ। తౌళవ సౌరాష్ట్ర • గౌళకర్ణాట। కరహాట ఘూర్జర • గాంధార కుకుర। కురుసాల్వ హైహాయ • ఖురసానభోజ। కేరళ బాహ్లిక • కేకయమత్స్య। శూరసేని ప్రయాగ • చోళవిదర్భ। కాశియవంతి కొం • కణ మళయాళ। దేశాధినాథులు • తెచ్చికానుకల। నొసఁగుచు నుండిరే • యోరుపుఁగలిగి। వెసనెఱిఁగింపుఁడీ • వేడుకతోడ।

మంత్రులారా? యిప్పుడు దేశాధీశులెల్లరు కప్పంబులనర్పింపఁ దప్పక మత్సన్నిధికి వచ్చుచుండిరా?

మం— దేవా! సకల దేశాధీశులును మీయాజ్ఞకు బద్ధులై కప్పంబులఁ దప్పక యర్పించుచుండిరి

ద్వా— దేవా! జయమగుగాక. జయమగుగాక.

సిం— ఏమిరా సమాచారము.

ద్వా— మీకుమారీరత్నమగు రత్నమాలిక యెందులకో

మీసన్నిధికి విచ్చేయుచున్నయది.

సిం— ఏది! నాప్రాణతుల్యమగు రత్నమాలిక!

రత్నమాలిక ప్రవేశించుట. దరువు – ఆది – మధ్యమావతి

రత్నమాలికవచ్చెను - తనతండ్రికడకు ॥ర॥ రత్నమాలిక యీడు! రమణులఁ గూడియాడుచు! రత్నమయకాంచన హారములు మెడనిండఁ దాల్చి ॥ర॥ అంచనడలతోను! నమృతకరుని ధిక్కరించునాననముతోను! పంచబాణుపత్నియో! పద్మజురాణియో! మంచుగట్టుపట్టియో! మాధవుభార్యయో యన ॥ర॥ పలుకుదురులుఁ బూడఁగా! దాడిమబీజముల నెకసక్కెమాడఁగా! జలజాక్షి వెలశేని! వలువదాల్చి సరిగమొగ్గల గోటుపట్టురవిక! సలలితముగఁ దాలిచి ॥ర॥ నీరజనేత్రి ద్వయముతో! కరశిరములబం! గారు సాభరణములతో! ధారుణి మోరిపుర! ధాముడై నట్టిచింతా! వీరభద్రవరదుని! వేడుచుసంతసంబున ॥ర॥

రత్న— ఆ॥ వె॥ తండ్రి! మీ మృదుపద • పుండరీకములకు,
దండమాచరింతు • నిండువేడ్క!
నీయనుజ్ఞనొజ్జ • నిఖిలశాస్త్రంబులఁ
గఱపెనింకఁ జేయు • కార్యమెద్ది॥

తండ్రీ! మీపాదారవిందములకిదే నమస్కరించుచుంటిని. మీయాజ్ఞ ప్రకార ముపాధ్యాయులవారు నన్ను సమస్తశాస్త్రములఁ బ్రవీణురాలినిఁగాఁ జేసిరి. ఇఁకఁ గర్తవ్యాంశ మూహింపుఁడు.

సిం— క॥ రావమ్మ రత్నమాలిక!
రావమ్మా ముద్దుగుమ్మ • రతనపు బొమ్మా!
రావమ్మ నిన్నుఁ గూర్చియె!
భావించుచునుంటి రేయుఁ • బవలును దల్లీ॥

అమ్మా! నీమృదుమధుర వచనంబులు నావీనులఁ బండువు సేయుచున్నవి కావున వచ్చి నాదక్షిణాంకమునఁ గూర్చుండుము.

రత్న— చిత్తము నాయనగారూ (అనికూర్చుండును)

సిం— రత్నమాలికా! గురుముఖమున సమస్తవిద్యలు దెలిసి

తిననియుఁ గర్తవ్యాంశ మూహింపుమనియుఁ జెప్పితివి. అట్లు చెప్ప నేల నేనహోరాత్రములు నీవిషయమే యోచించుచుంటిని కావున నంత సంబున నతఃపురమున కేగి సుఖంబుననుండుము

రత్న — చిత్తము నాయనగారూ! (అని నిష్క్రమించును)

సిం— గీ॥ మంత్రివర! నాదుసుత రత్న • మాలకిపుడు!
తగిన వరుఁజూచి పెండ్లి సే • యఁగవలయును।
జారులను బంచి సకల దే • శ ప్రభువుల।
సుతులపటములఁ దెప్పించు • మతిరయమున॥

మంత్రీ! ద్వాదశవర్ష ప్రాయముగల నాకుమారీరత్నమగు రత్నమాలకుఁ దగిన వరునిఁగూర్చి వివాహము గావింపవలెను. కావున శీఘ్రముగఁ జారులనుబంపించి సకలదేశ రాజకుమారుల పటములను దెప్పించుము.

మం— చిత్తము......అరే చారులారా! మీరతి శీఘ్రముగఁ బోయి సకలదేశ రాజకుమారుల పటములను గొనితెండు పొండు.

చారు— చిత్తము దేవా! మీయాజ్ఞప్రకారమట్లనే పోయెదము (అని నిష్క్రమింతురు.)

సిం— మంత్రీ! యిదిగో నాపుత్రిక చిత్తరువునుదిలకింపుము ఈమెకుఁదగినవరుఁడీ భూమండలంబున నుండఁకూడుననితోఁపదు కన్నులారఁ గాంచినచో దృష్టిదోషమంకురించునని భయమగుచున్నది.

మం— రాజా! మీరు సెలవిచ్చిన ప్రకారము తమ కుమారితమిగుల సౌందర్యవతియే యైనను మనము పంపించిన చారులు తెచ్చెడు పటములలో నీమెకనురూపవంతుఁడు లభ్యుఁడుగాక పోఁడు.

చా— (ప్రవేశించి) దేవా! మేము తెచ్చిన పటములివిగోఁ జిత్తగింపుఁడు.

సిం— మంత్రీ! యూ తెచ్చినపటము లేయే రాజకుమారులవో వేఱువేఱుగఁ దెలియం బఱుపుము.

మం— గీ॥ ఇతఁడు కుంతలదేశ భూ • పతి సుతుండు।

సమరమందున వైరుల • సంహరించి।
ఖ్యాతినొందిన బలపరా • క్రముఁడు మిగుల।
సుందరుఁడు వీనిపటమిదె • చూడుడయ్య।

దేవా! ఈకుంతల రాజాత్మజుఁడు సమరమున వైరులసంహరించి ఖ్యాతినొందిన బలవంతుఁడు. ఇదిగో వీనిపటముఁ జిత్తగింపుఁడు.

సిం — గీ॥ మంత్రి! యీకుంతలేశ కు • మారురూపు।
అధికమగు సుందరంబున • నలరెఁగాని।
వామకర్ణము కటిలమై • వంగియుండె।
నితనికీలోప ముండెను • నిదిగొఁజూడు॥

మంత్రీ! యీకుంతలేశ్వర కుమారుని రూపము మిగుల రమణీయముగానున్నను వామకర్ణమించుక వంగియున్నది చూడుము.

మం— దేవా! యదిసత్యమేకాని

గీ॥ అరయుఁడయ్య! యీతఁడు కళిం • గాఖ్యదేశ।
మానవాధిప సూనుఁడు • దానపరుఁడు।
కాటిదిమ్మరిఁ నెచ్చెలి • కానిపట్టి।
నందమందున గెల్చిన • సుందరుండు॥

దేవా! యీకళింగ రాజాత్మజుఁడు ధర్మాత్ముఁడును నలకూబరుని మించిన సుందరుండును నగు వీనిపటముఁ జిత్తగింపుఁడు.

సిం— గీ॥ అహహ! యేమందునీ కళిం • గాధిపసుతు।
సుందరముఁజూడ ధనదుని • సూనుమించుఁ।
గాని కుడికన్ను చిన్నదై • కానుపించె।
నిందుకందము న్యూనత • నొందెనుమ్మ॥

ఈకళింగరాజాత్మజుఁడు సుందరమున నలకూబరుని మించియున్న కుడికన్నుకొంచెము చిన్నదిగఁ గాన్పించుచున్నది. ఈక్షింపుము.

మం— అదవాస్తవమే కాని

గీ॥ దేవ! యీతఁడు కాశ్మీర • దేశరాజు।
సుతుఁడు మదనునిఁ బోలిన • సుందరాంగుఁ।

డమితబలశాలి సర్వవి • ద్యాధికుండు।
చూడుఁడీతఁడు మీసుత • కీడొకాదొ॥

దేవా! యీకాశ్మీరరాజన్యుని చిత్తరువు వీక్షింపుఁడు.

సిం— గీ॥ ఇతనియాకృతిఁగనఁ గుసు • మేషుమించు।
సంగపాటవ మెంచఁగ • నలవిగాదు।
సన్యహస్తంబు మిక్కిలి • సన్నగిల్లె।
సహహయీరాజు కీకొలం • తమరియుండె॥

ఈకాశ్మీరరాజకుమారుఁడు రూపమునఁ బంచశరునిమించి మిక్కి లి యంగబలముగలవాఁడైనను నీతనివామహస్తమెంత సన్నముగ న్నదో కనుఁగొనుము.

మం— అయ్యా! అదినిజమేకాని

గీ॥ పొలుపుమీరెడు సౌరాష్ట్ర • భూమిపాలు।
దత్తపుఁ గుమారుఁడీతని • చిత్తరువిదె।
యరయుఁడాపాదమస్తక • మందమందు।
నుద్దియగునేమొ మీసుత • కుర్వినాథ॥

దేవా! యీసౌరాష్ట్రదేశాధిపతి మీకన్యకుఁ దగునేమో పరి లింపుఁడు.

సిం— ఇతఁడును మసకన్యకుఁ దగినవాఁడుకాఁడు.

మం— క॥ మనుజేశ! వంగభూపతి।
తనయుఁడు సుకుమారుఁడమిత • ధర్మాత్ముం
ఘనుఁ డేమీ సుతకుందగు।
ననినామనమునకుఁదోఁచె • నరయుఁడు వీని

రాజా! సుకుమారుఁడును ధర్మాత్ముఁడును ఘనుఁడును నగు నీవ గరాజాత్మజుని చిత్తరువు గనుఁగొనుఁడు. ఇతఁడే మసకన్యకుఁ ద నవాఁడని నాకుదోఁచుచున్నది.

సిం— క॥ బాపురె! యీతనినోయగ।
మేపార్థివ సుతునికైన • నెంచంగలదే।

రూపమున నలవసంతర।
తీపతులఁ దిరస్కరించు ధీరుఁడుతలఁప॥

అయ్యారే! యీతనిసోయగ మీక్షింపఁ గంతువసంతుల నెంతయుఁ దిరస్కరించు చున్నదికాని శరీరమించుక దుర్బలత వహియించి యున్నది. పరీక్షింపుము.

మం— దేవా! యదినిశ్చయమేకాని మనము తెప్పించిన పటములలో నీతనిపటమే మిక్కిలి రమణీయమై తోఁచుచున్నది. ఇంత శ్రమించిన సుందరులిఁకఁ గాన్పింపకుండిరి. ఇఁకేమిసేయుదము.

సిం— అక్కటా విద్యున్మాలీ!

దరువు-రూపకము-ముఖారి.

తగినవరుఁడు దొరకఁడాయెఁ। దనయకుఁ బెండ్లెటులుఁజేతు ॥ద॥ మగువలకును వరరూపమె। మక్కువయని బుధులందురు ॥త॥ సకలరాజుల మారులపట। సమితినిఁదెప్పించిచూడ। నొకఁడుదుర్బలుఁడొకఁడు గుజ్జి। యొకడు నంగవికలుఁడయ్యె ॥దగి॥ మారునిసతిఁ బోలునాకు। మారిత కను రూపవరుని। ధారుణిశ్రీ మీరినగర। ధాముఁడు సమకూర్పఁడాయెఁ ॥దగి॥

కటకటా! మంత్రీ! యెంతప్రియత్నము చేసినను నాకుమారితకనురూపవరుని గానకైతి. ఇఁకనీవివాహ మెట్లుజరుగునో తెలియకుండెఁగదా.

మం— దేవా! చింతింపకుఁడు కలహంసకులూక సంపర్కము కలుగునా? మీకుమారీమణి కనురూపవరుని దయాసముద్రుఁడగు నాఫాలనేత్రుఁడే సమకూర్పఁగలఁడు. అంతవఱకుఁగొంచెమోపికఁబూని యుండుఁడు.

ద్వార— దేవా! జయమగుగాక.

సిం— ఏమిరా సమాచారము.

ద్వార— దేవా! మనద్వారముకడ నెవరో రాజాంశసంభూతునివలెఁ గన్పట్టు నొకమహానుభావుఁడు మీదర్శనార్థమై వేచియు

నాఁడు.

సిం— శీఘ్రముగఁ బ్రవేశపెట్టుము.

(బుద్ధిసాగరుఁడు ప్రవేశించుట) దరువు — ఆది — రేగుప్తి.

బుద్ధిసాగరుఁడువచ్చెను। సింహకేతుకొల్వుకు ॥బు॥ బుద్ధిసాగరుఁడు రాజు। నొద్ద సెలవొందితనదు। ముద్దు బాలకుని రూపు। దిద్దిన పటముఁగైకొని ॥బు॥ ఏతీరునైన సింహ। కేతు నొప్పించి యాతని। కూఁతునిప్పించి పెండ్లి। సేతుఁ జంద్రికాంతునకని ॥బు॥ దేవనృప పితృకార్యముఁ। దీర్చిన మానవుండే। పావనుఁ డనుచుమదిని। భావించి శీఘ్రముగను ॥బు॥ ధారుణి మోరిపుర। ధాముడై నట్టి చింతా। వీరభద్రవరదుని। గోరిభజించుచును ॥బుద్ధి॥

బుద్ధి— క॥ వంధనము దనుజనాయక।
వందనమో సింహకేతు • వసుధాధీశా।
వందనమిదె చేసెదనా।
నందముగాఁ గొనుఁడు కాంచ • నాపురనాథా॥

దేవా! నమస్కారము.

సిం— క॥ ఏపట్టణ వాసులరో।
యాపట్టణ మేగుదెంచ • హేతువదేమో।
కాపట్య ముడిగి తెల్పుం।
డాపరమోదంతమెల్ల • నాకర్థింతున్॥

అయ్యా! మిమ్ముఁజూడ నాకత్యానందమగుచున్నది. మీరీ సింహాసన మలంకరించి మీనివాసపట్టణమును మీరిటకరుదెంచిన కార్యంబును మీనామధేయంబును వినవలెనని బుద్ధిజనించుచున్నది. కాన వేగ వాక్రుచ్చుఁడు.

బుద్ధిసాగరుని దరువు — ఆది — నాదనామక్రియ.

వినుదైత్యనాయక। వీనులకింపుగ ॥వి॥ చనుదెంచిన కార్యము। సాంతముగానెఱింగింతు ॥వి॥ కరవరుదుగనామోద। పురమేలు చంద్రచూడ। నరపాలునకుమంత్రి। వరుఁడ బుద్ధిసాగరుఁడ ॥వి॥ తనముద్దుల పు

ని। కనుహూపవతియైన। కనకాంగినరసిర। మ్మని బాలునిపటమిచ్చె॥ రాజా జరీతినెల్ల! రాజ్యములఁ దిరిగిమా। రాజన్యనకుఁడగు। రణిచిఁగాన నైతి ॥వి॥ధరణిలో శ్రీమోరి। పురధాముఁడైనసర్వే। రునిఁదలంచుచుమీ। సముఖమునకువచ్చితి ॥వి॥

దేవా! నేనామోదపురంబేలు చంద్రచూడ మహారాజు మంత్రి. బుద్ధిసాగరుండనువాఁడ. మారాజు తనసుతుఁడగు చంద్రికాంతుని రూపమొక పటమునవ్రాయించి యాపటమును సకలదేశములఁ ద్రిప్పుచు నారాజన్యున కనురూపవతియగు కన్యను జూచివచ్చుటకే యని నాకాజ్ఞాపించె నేనును నాపటముఁ గైకొని దేశదేశములు త్రిమ్మరుచు మీసముఖమున కరుదెంచితి నిదియే సమాచారము

సిం—— సంతోషము. సంతోషము. బుద్ధిసాగరా! మేమును రాకుమారికి కనురూపవరు నరయుటకై యనేక రాజకుమారుల పటములఁ దెప్పించి పరిశీలించితిమి కాని తగినవరుఁడు గాన్పింపఁడయ్యె నయినను మీరాజకుమారుని పటముఁ జూడనిమ్ము.

బుద్ధి—— ఇదిగో మీయిష్టమువచ్చినట్లు పరిశోధింపుఁడు (అని యిచ్చును)

సిం—— (చూచి) అహహా! మంత్రీ! యితనిసోయగ మేమని వర్ణింతు.

క॥ ఏరికిఁ గలదీ సోయగ।
మీరాజకుమారుప్రజ్ఞ యీనగుమోముల్।
చారువిశాల నయనములు।
తీరగువక్షంబు మిగుల దీర్ఘపుబాహుల్॥

ఇదివఱకుఁ గన్నరాజకుమారులకన్న నధిక తేజోవిరాజమానుండ ఈచంద్రికాంతుడే మనరత్నమాలకుం దగిన వరుండనితోఁచుచున్న. బాగుగ బరిశీలింపుము.

మం—— రాజా! మనరత్నమాల పూర్వపుణ్య విశేషంబున నిట్టివంటి వరుఁడు లభ్యమయ్యెఁ గావున మనరత్నమాలిక పటమును

బుద్ధిసాగరుని కిప్పింపుఁడు.

సిం— బుద్ధిసాగరా! మీరాకుమారుని పటముఁజూడ మాకు సమ్మతమైనది, ఇదిగో నాకుమారిత యాకృతిపటమీక్షింపుఁడు (అని యిచ్చును)

బు— (చూచి) బాగుబాగు వీరిరువురకుం దగునని వేఱచెప్పవలయునా? సకలవిధముల రతీమన్మథులఁ బోలియుండిరి. కావున కర్తవ్యాంశమూహింపుఁడు.

సిం— ఊహించుట కేమున్నది. రేపటిదివసమునరాత్రిపదిగడియలప్పుడుఁ గన్యాలగ్నమున వివాహమునకు శుభప్రదముగా నుండునని యింతకుముందు మా దైవజ్ఞులు సెలవిచ్చిరి. కావున మీరాజకుమారు నాసుముహూర్తమునకుఁ దోడ్కొనిరమ్మని చంద్రచూడభూపాలున కెఱింగింపుము.

బు— చిత్తము. నేఁబోయివచ్చెద సెలవొసంగుఁడు.

సిం— మంచిది. శీఘ్రముగఁ బోయిరమ్ము వ్యవధిలేదుసుమా ముహూర్తము దాఁటకూడదుసుమా.

బుద్ధి— చిత్తము (అని నిష్క్రమించును)

సిం— మంత్రీ! మనకాశీవిశ్వేశ్వరుని కృపవలన మంచిసంబంధమే సంప్రాప్తమైనది. కావునఁ దక్షణము కళ్యాణమంటప మలంకరించుటకు సేవకాముఖంబునఁ జిత్రకారుని రప్పించి వెంటనే సిద్ధము చేయింపుము.

మం— మీయాజ్ఞప్రకారమట్లే చేయించెదను.

[ అంతసింహకేతునియొద్ద సెలవుగైకొన్న బుద్ధిసాగరుఁ డామోదపట్టణముఁ బ్రవేశించి యీవార్త చంద్రచూడున కెఱింగింపంగ నతఁడుసంతోషాంతరంగుండయి తనకుమారునొక పెట్టెయందిడి మంత్రిసుతుఁడగు చంద్రసేనునకా పెట్టెనిచ్చి వివాహవిధియందు జరుగుపద్ధతు లిట్లిట్లని చెప్పుచు బుద్ధిసాగరుని సహితముగ వివాహమునకుఁ దరలివచ్చుట. ]

దరువు—ఆది—సావేరి.

వెడలెఁ జంద్రమూడ నరపతీ! యుద్వాహమునకు ॥వెడలె॥ వెడలెఁ జంద్రమూడ నృపతి। వేడుకలర సింహకేతు। పుడమిఁ జేనికూఁతుఁ దనదుకొడుకునకు వివాహముఁజేయ ॥వెడలె॥ అంతరంగమందమాత్య। మంతనంబునకు మెచ్చి। వింతవింత వస్తువులను। సంతసంబునఁ ధరించి ॥వెడలె॥ సుతుని బేటికనుంచి మంత్రి। సుతునకాందనమునిచ్చి। మతిసముద్రునితోడ శీఘ్ర। గతినేగుహయమునధిష్ఠించి ॥వెడ॥ వాసిగాశ్రీ మోరిపురని। వాస చింతా వీరభద్ర। దాసపోషకుండగు స। ర్వేశునిమదిఁ దలఁచుకొనుచు ॥వెడలె।

చంద్ర— బుద్ధిసాగరా! ఇదిగో, మనము కాంచనాపురి సరిహద్దునకు వచ్చితిమి. ఇప్పుడు సింహకేతుఁడు మనలఁదోడ్కొని పోవుటకై తన పరివారముతో వచ్చును కావున నీకుమారుఁడగు చంద్రసేనున కెవ్వి నేని నెఱింగింపవలసినచో నెఱింగింపుము

బు— తెలియఁజేయు విషయములెల్ల నింటియొద్దనే తెలియ జేసితిని.

చం— సంతోషము. సంతోషము.

సిం— అమాత్యా! అమాత్యయుతుఁడై కుమారునితోఁ జంద్రచూడుఁడే వచ్చుచున్నాఁడు కావున మన మెదురుగాఁబోయి వారిం దోడ్కొని వత్తమురమ్ము.

మం— చిత్తము. నడువుఁడు. రాజా!

సిం— (చంద్రచూడు నెదుర్కొని) బావగారూ! రండు. మీరలందరీ సింహాసనము లలంకరింపుఁడు.

(అందఱుకూర్చుందురు.)

చం— బావా! యింటినుండి మన బాంధవ్యమును గూర్చి యించుక ప్రసంగింప వలయునుగదా.

సిం— అట్లనేదరేల? కూఁతునిచ్చువారి కెట్లయిన నంగీకృతమేకదా.

బు— అయ్యా మర్యాదలకేమి సుముహూర్తమాసన్న మగుచున్నది చేయఁదగిన కార్యము నాలోచింపుఁడు.

సిం— మంత్రి! మనపురోహితుల రప్పించుటకు సేవకులఁ బంపుము.

మం— చిత్తము... సేవకా! మనపురోహితుల శీఘ్రముగఁ దోడ్కొనిరమ్ము.

సే— చిత్తము. పురోహితుల వారిని దక్షణము తీసుకొని వచ్చెద (అని నిష్క్రమించును)

[ పురోహితుఁడువచ్చుట ] దరువు – ఏక – కళ్యాణి.

పోదం వస్సారప్పంభొట్లు పోదంవస్సారా। వేదంభొట్లు వెంకంభొట్లు నాదంభొట్లు నర్సంభొట్లు ॥పో॥ రాజుగారు రమ్మన్నారమ। రత్నమాలకుఁబరిణయమమ। రాజులందరు వచ్చేరమఁయా। రాత్రికన్యా లగ్నంబమ ॥పో॥ భూరిదక్షిణ లిస్సారమ। బుట్టబుట్టకొక జామారమ। వారిబ్రాహ్మణుఁడు రాతేదమ। వారికి వీరికి మనమేనమ। ॥పో॥ దొడ్డదొడ్డ భోజనములమ। దొడ్డినిండ పందిళ్లేనమ। గిడ్డిపెరుగు నెయ్యుంచేరమ। వడ్డన మన రెడ్డెంభొట్లేనమ! ॥పో॥ కొసగల విస్తరి వేస్సారమ। కోరిన నెయ్యొడ్డిస్సారమ! పెసరపప్పు చెయ్యుంచేరమ! పెద్ద పెద్ద బూర్లొండేరమ! ॥పో॥ కాసులుచాలా తెచ్చేరమ। జోస్యునికొక్కకటిస్సారమ। వాసిగ మోరిపుశేశునిఁగొల్వని। వారలనచటకు రానేనివరమ ॥పో॥

సిం— పురోహితులవారూ! మనరత్నమాలికకు వివాహముఁ గావింపుఁడు.

బ్రా— రాజా! పెండ్లికుమార్తెను రప్పించుట కాజ్ఞయొసంగుఁడు.

సిం— సేవకా! మన రత్నమాలకు సకలా భరణము లలంకరించి కల్యాణ మంటపమునకుఁ దోడ్కొని రమ్మని నాతిసాంగనలకుఁ దెల్పుము.

సే— చిత్తము దేవా! (అని నిష్క్రమించును)

(రత్నమాలిక చెలికత్తెలతోఁ బ్రవేశించును)

బ్రా— అమ్మాయీ! ఇటురమ్ము...చంద్రికాంతుఁడా నీ పీఠమున నధివసింపుము. నీవావామ పార్శ్వంబునఁ గూర్చుండుము రత్నమాలికా.

(బ్రాహ్మణులు విఘ్నేశ్వరపూజాపుణ్యాహవాచనలు చేయింతురు)

శిష్యు— అయ్యాగురువుగారూ! పెండ్లికుమారుని వైపు పౌరోహిత్యము నాకిప్పించరండీ.

బ్రా— ఓరివెధవా! అప్పుడే గురువునకుఁ బంగనామములు పెట్టుచుంటివిరా?

బ్రా— (మంత్రముచదువుచు) అమ్మా నీచేతనున్న పుష్పమాలిక చంద్రికాంతుని మెడలోవేయుము.

ర— (అట్లుచేయఁబోవును)

చం— అశుభము తాళుము. ఆమాలిక యీమందసములోనున్న మాయిష్టదైవమున కర్పింపుము.

సిం— ఓయీ! అట్లనెదవేల.

చంద్రిచూ — అది మావంశాచారము తప్పించుట ధర్మమా?

బు— సింహకేతుమహారాజా! పూర్వాచారమంతటికిఁ గర్తవ్యమే. ఇందుమీరాక్షేపింపఁ గనిదేమున్నది.

సిం— అట్లయినఁ గానిండు... అమ్మా! నీభర్తయిష్టదైవ పేటిక యందుండెనఁట. ఆ దైవమును మనసునఁ దలంచుకొని దంపతుల ననిశముఁ బాయకుండునట్లు సేయుమని యామాలిక నట కర్పింపుము.

బ్రా— (ఆశీర్వచనముచెప్పి లేవఁదీయును)

పి — బావగారూ! మీతో వియ్యమంది చంద్రకాంతు నల్లు

చంద్రికా— బావా! మేము నట్లనే సంతసించుచుంటిమి

చెలి— మహారాజా! మీరునాకు సెలవిండు. రత్నమాలిక చంద్రికాంతులు వచ్చువఱకుఁ గేళికాగృహమలంకరించెదను.

సిం— మంచిది పొమ్ము ...... మంత్రీ! మనముకూడ నంతఃపురంబునకుఁ బోదమురమ్ము.

మం— చిత్తము. నడువుఁడు. (అని ఇరువురు నిష్క్రమింతురు)

బు— కుమారా, చంద్రసేనా! వివాహమున నెట్లో దాఁటితిమిగాని యారాత్రి గర్భాదానమున భంగమేమిగల్గునోయని భయముపుట్టుచున్నదిగదా.

చంద్రసే— నాయనా! బుద్ధిసాగర నామమునఁ బ్రఖ్యాతి నొందు మీకాత్మజుఁడనై మీప్రతిజ్ఞకు భంగముగల్గఁ జేయుదునా భయపడకుఁడు ఎవ్విధముననైన మాతృదోషమంకురించకుండఁ ద ప్పించుకొని మీలోఁజేరెదను. మీరుముందుగ మనపురి కేగుఁడు.

(చంద్రసేనుఁడుతక్కఁదక్కినవారు నిష్క్రమింతురు)

చంద్రి— ఆహా దైవమా, నేటిదినంబున నాతండ్రియగు బుద్ధిసాగరునియాజ్ఞ శిరసావహించి పరిణయనమయమున పీసగము వేయుటలో నెట్లెట్లో మిషఁబన్ని రాకుమారుఁడున్న మంద్రసమున కే వేయించితిని. కాని యిప్పుడీగర్భాదానంబున మాతృదోషమంకురించకుండ నెట్లుతప్పించుకోఁగలనో కదా.

దరువు — అట — జాలికాంభోది.

హరహర నేఁడీ దుష్కరమైనకార్య మే। కరణి నిర్వహింతునో యేకరణి నిర్వహింతునో॥ వరుసంగ మెచ్చగల। వనిత చెంగటికేగి వ అలివచ్చుటెట్లనో। నే। వఁ అలివచ్చుటెట్లనో ॥హర॥ పతిం భావిం చినఁ బలవంత పెట్టిన। నతివనే మని తెల్పనో। యా। యతివకే మని తె ల్పనో॥ రతినిహాసియించునా। రమణి సాయగమునా మతినిహరించు నేమో। నా। మతినిహరించునేమో హర॥ ధరమోరిపురసత్వో। శ

యీకార్యమున నే। కొఱఁతగల్గకుండఁగా। నాకే। కొఱఁతగల్గకుం
డఁగా। కరుణింతురని యీపద। సరసిజంబులకు నే। నెరఁగివేఁడుచునుంటిఁ
గా। నే। నెరఁగివేఁడుచునుంటిఁగా ॥హర॥

సీ॥ నవమోహనాంగి నా • నయనంబులంబడఁ
గామాంధకారంబు • గ్రమ్ముకున్న।
మంజుభాషిణి మృదు • మధుర వాక్యంబులఁ
గర్ణములకు విందు • గాకయున్న।
గజతుండబాహుస్త • గౌఁగిలింపంబోవఁ
బులకితమ్మై మేను • పొంగకున్న।
పతిసంగమాసక్త • రతికిఁ దొందరసేయఁ
గతినమానామది • గరఁగకున్న॥

గీ॥ ఎట్లుపోవుదు రాజాజ్ఞ • నెట్లునల్ప।
నోపఁజాలుదు నాడెంద • మాపుటెట్లు।
ఒంటిగా రత్నమాలిక • కంటఁబడియుఁ।
దిరిగివచ్చుట మృతినుండి • మఱలినట్లు।

హా! సర్వేశ్వరా!! యన్నివిషయములో మాతృదోషము సంభవించ
కుండ నెట్లురక్షింతువో సీదియేభారము (అని యచ్చటనుండిపోయి
కేళికాగృహమందుఁ బ్రవేశించును)

(రత్నమాలికయుఁ జెలికత్తెలును బ్రవేశింతురు)

చెలి— అమ్మా రత్నమాలికా! పడకగది శృంగారముగా
నలంకరించితి నీపతి చంద్రికాంతుఁడును వచ్చియున్నాఁడు ఇఁక సంశ
యింపక పడకటింటికేగి పతిపర్చించుకొమ్మా.

ర— ఓసీ చెలి అప్రకసంగ్రామంబున శరీరమెల్ల వణకుచున్న
ది. ఈవిషయమై నీవుకూడఁ దోడ్పడరాదఁటే.

చెలి— అమ్మ యొ్య' వణఁకుటయే కాదు శరీరమెల్ల గగుర్పా
టు చుటయు ఘర్మకణములు ముత్యములవలెఁ జెమర్చుటయు నేత్ర
ములకెకదృష్టి కల్గుటయుఁగూడ సంభవించెను.

వేఱొకచెలి— అయ్యో! నూతనముగా భర్తృసందర్శనమున నట్లేయుండును. నీవుమఱింత భయపెట్టక యీవలకురమ్మా.

చెలి— అ–లేదులేదు ఇదిగో వచ్చుచున్నాను

ర— ఓసీ! చెలియా! నేనుగూడ నీవెంటవచ్చెద నే;

చె— చాలుఁజాలు నేర్చికొంటివిలే శీఘ్రముగాఁబోయి పతి నర్చించుకొనుము. నేఁబోయెద (అని రత్నమాలికను లోపలికి గెంటును.)

ర— ఆహా! నాపూర్వజన్మ కృత పుణ్య విశేషంబు వలనఁ బంచశరుని బోలు భర్త సంప్రాప్తమయ్యె. నేనెంత ధన్యురాలను. మదీయ వాంఛాలతిక నేఁడే పల్లవించినది. నేనుముగ్ధత్వంబున నూఱకున్నచో నిరాకరించితినని యెంచుకొనునేమో. ఇఁకఁబోయి నాభర్తనర్చించెద.

సంవాద దరువు – ఆది – కాంబోది.

ర— రమ్మ రమ్మ ప్రాణనాయకా। సింహాసనమునీ। పుష్పమ్మలంకరింపుము నిలువక। రమ్మ రమ్మ సీఘఁజలువ। తెమ్మెర సోకింప సురఁటిచే। నమ్మతిగ విసరియు దే। హమ్మునఁ గలయలయకఁ దీర్చెద ॥రమ్మ॥

వ— నాథా! మీ రిటుల నిలిచి యుండుట ధర్మమా వచ్చి యీసింహాసన మలంకరింపుఁడు మీ శరీరమించుక యలసినట్లుగాన్పించు చున్నది నేనాయలసట కీర్చుట కర్హురాలనే కనుక నీసురఁటిచే విసరెద రండు.

చం— వ! రత్నమాలికా! యీసింహాసన మలంకరింపఁ దగినట్లే యలంకరించితిని (అనిపెట్టెను సింహాసన మందుంచి)

ఇతఁడభీష్ట దాయకుఁడు సుమా। మన యిరువురకును। సతతము శుభ మొసఁగు నమ్ముమా। యితఁడే యిందుశేఖరుని। సుతుఁడటంచు మదినినమ్మి! కుతుకమలర సుర టివేయు। సతివ! నాశాఫలము చెందు ॥నిత॥

వ॥ రత్నమాలికా! మనయంతఃపురమునఁ బ్రభువగు నీయిందు శేఖ
రమహారాజునకే సురఁటి వేయుము. తత్సపర్యా ఫలము నాకే చెందును

ర — వ॥ ఆహా యేమిది పరిణయ సమయంబు వలెనే నేఁ
యుచున్న యుపచారము లీయిష్టదైవమునకే యర్పింపు మనుచుం
. ఐనను ముందుగా నొక తాంబూలము దైవమునకిచ్చి మఱియొ
తాంబూలమీయన కిచ్చెదను. [అని దేవునికొక తాంబూలమిచ్చి]
ఫీడమైనఁ గరుణఁ గైకొనుఁడు। మీయిష్ట దేవునకుఁ గూడనిచ్చితి
ంశయింపకుఁడు॥ వేడుకఁ బతులకుఁ దమవిరి। బోఁడులొనరించుఁ బరి
ర్య। లేడనైన నిటులవిడ। నాఁడువారు గలరె జగతిని ॥వి॥

వ — నాథా! సతులొనరించుఁ బరిచర్య లెచటనైన వలద
వారు గలరా? కరుణచే నీతాంబూలముఁ గైకొని నన్ను సంతసిం
జేయుఁడు.

చం — ఇట్టియైహిక సుఖము లేటికి। క్షణభంగురంబగు। న
మానూశరీరము దనికి। నిట్టిసుఖము లేలమంచు। గట్టుపట్టినేలినట్టి।
ట్టకంటి వేల్పుముగ్గు పట్టిసేవదక్కనాకు ॥నిట్టి॥

వ — కాంతా! క్షణభంగు రంబగు శరీరమునకీ యిహ సుఖ
ములతోఁ గార్యమేమి?

ర — గీ॥ ఆహాహా! నేఁజేయుపరిచర్య ♦ లందకునికిఁ।
గారణంబేమి నాయందు ♦ నేరమేమి।
తనువశాశ్వత మనుచును ♦ ధరణి జనులు।
ఇహసుఖంబులు విడిచిరే ♦ యిందుకులజ॥

వ — నాథా! తనువశాశ్వతమని తెలిసియుండియు నిహసు
ము లెవరు వి డిచిరి? మీ రేదియో కారణంబున నిట్లనుచుంటిరి కాని
ాంతుకాదు లేకుండిన మీకెద్ది యేని నహితకార్య మాచరించితి
మో క్షమింపుఁడు.

చం — వ॥ కాంతా! కారణమున కేమున్నది.

కందార్థము.

జననమె నారక కారణ। మనిపల్కెడు బుధులవాక్య • మాలించి యుమా। నినులం గూడుట, వీడెము। లను వేయుట ననలుభూష। లను ధరించుట। మొదలగుసుఖము। లనుభవించుట॥ యిననుతునాల యు। మునఁ బాయగరాని। ఘనసరకములఁ బడి। వనటఁ బొందుటకె దుస్తు ॥లను॥

వ— జననమే నరక కారణమను బుధుల వాక్యములు విని యుండియు నిటువంటి యైహికసుఖంబు లనుభవించిన జన్మాంతము న యమభటులు పెట్టుబాధల కెట్లుతాళఁగలను.

రత్నమాలిక కందార్థము.

ధరణీ మానవులెల్లరు। పరిణయమన సంతసించి పడఁతిఁగలయు చు। యురుతర సౌఖ్యమటంచును। దరుణులఁ బెండ్లాడి సుతులఁ। దగఁ గాంచరే దే। మీవేదాం। తము వింతగాదే। తగదు మీరిటులాడఁ। దరు ణమిదె ననుఁగూడ। మిగులఁ గుతుకముతోడ। బిగికౌఁగిలిమ్ము జే డ ॥ధ॥

వ— నాథా! యిలజన్మించు ప్రతిమానవులును బరిణయ మ న సంతసించి సతీసంగమమే కడుసౌఖ్యమనియెంచి సతులఁ బరిగ్ర హించి వంశవృద్ధికై సుతులఁ బడయుచుండుటజూడలేదా? ఇంకమి వేదాంతముఁ గట్టిపెట్టి నన్నుం బిగియారం గౌఁగిలించి మదన కదన ము సల్పనిదేయదను. [అని కౌఁగిలింపఁబోవును]

సంవాద దర్వు — ఆది — బేహాగ్

చం— తలఁచవద్దు రత్నమాల। నే। నిలానుఖముల కొప్పఁ జాల మేల ॥తల॥ కలుషముచే కూరుస్త్రీల। రతిఁ గలయుట చేతనె చాల। బాల ॥త॥

ర— కులకాంతల పొందుఁగోరు। వారికి॥ గలుషము లెటు లఁజేకూరు। నాథ। యిల మానవులలో నీతీరు। పట్టు। దలవహించిన వారు లేరు ॥కు॥

చం— కామమోహ బంధములఁ। జిక్కి। ఘననరకములఁ బొందనేల॥ యీ। సోమశేఖర సుతునిలీలఁ। గొల్చి। సుఖమొందు సందేహమేల। బాల। ॥త॥

ర— విరహాగ్నికెటు సైఁ పఁగలను। మరుఁడు। విరిశరముపే సినాయెదను। నాథ కరుణఁ గాఁగిలి యిచ్చియతను। కేళిఁ। గలయుని దే మంచియదనుఁ గను ॥కు॥

చం— సంసార జలధి మునింగి। యిఁక। సద్గతిఁ జేరుటెఁట్లు భంగి। పాప। హింసదోషములకు లొంగి। పుణ్య। హేయమా కౌఁగిలొసంగి। పొంగి ॥త॥

ర— పరిణయ మాడిన స్త్రీల। నిటుల। బాధల నలయింప మేల। నాథ। ధరమోరిపుర మేలుకాల। క౦। ధరుఁడు మిామదిఁ దిర్పుజాలఁజేల ॥కు॥

వ— పరిణయ మాడిన స్త్రీలతోఁ బొందుసల్పిన నరకమె ట్లు వాటిల్లును?

చం— క॥ కామాద్యంతశ్శతుర్వి
స్తోమమునకుఁజిక్క మోక్ష • సుఖమెట్లబ్బున్।
కామిని భవహరుడగునా।
సోమజటా ధరునిమదిని • స్తుతిఁజేయుమిఁకన్॥

వ— రత్నమాలికా! కామక్రోధలోభ మోహ మదమాత్స ర్యంబులఁ జిక్కిన మోక్షము దూరమగును. కావున పాపరహితమగు శివనామ సంకీర్తన మాచరింపుము.

ర— వ॥నాథా యైహిక సుఖము లందనిసరుఁ డాముష్మి క సుఖంబెట్లు చెందఁగలఁడు కామిగాక మోక్షకామి గాఁజాలఁడను పారోక్తి వినలేదా?

చం— కాంతా। అంద రానిమానిపండ్ల కఱ్ఱులుసాచు విధం బున నేల యీలీల నాశాపాశములఁ దగుల్కొనియెదవు కామహీనుఁ డైన నాయొద్ద నెన్నిపల్కినను వ్యర్థమేయని తెలిసికొమ్ము.

ర— అట్లయిన వివాహ సమయంబున నీవేదాంత మెట
గినది?

చం— వివాహ విధియందు జరిగిన వన్నియు నప్పుడే యీ
శ్వరార్పణ మైనవి.

సంవాద దరువు – ఆది – నాటకురంజి

ర— ఎటులోర్వఁగలఁ బ్రాణనాథా। నన్నిటులాడమీకుప
ర్యాదాదయరాదా। యిఁక ॥నె। కటకటాయామనుఁడు। కఠినాత్ము
డై యిపుడు। పటురోషమునవచ్చినాఁడు। బాణ। పటల మెదనాటినా
డు। కర్ణ। పుటములకుఁ జెవుడుపుట్టనఱచినాఁడు ॥ఎ॥

చం— ఎంతఁ జెప్పినవినవదేల। నా। న్నింతగఁబ్రతిమాల। నే
ల। యొప్పజాల। చెలి ॥యెం॥ కంతుబాణములు చెంతకేటురాఁజాలు
కంతుద్వేషి. స్తోత్రములు। సేయఁజింతలెల్ల వెడలఁజాలు। జ। న్మాంత
మున సుఖములు చెంతఁజేరఁజాలు ॥నెం॥

ర— నేఁజేసినపాపమేమి చిల్కా। శేజీవజీవుని యాశకొప్ప
దేమి ॥నే॥ భూజనార్చిత! పాదగా జీవములుసదా। పూజించెదఁ బా
ణనాథ। మోరాజ వంశజ యిట్టివ్యథ॥ బెట్టఁదేజంబు తఱుఁగద
జనంబుపోద ॥నే॥

చం— తరుణీమణీ సంగమంబు। సేయఁజొరఁజాలదు నావ
నంబు। నిక్కంబువిను ॥త॥ పరలోక సౌఖ్యంబు భంగబు దోషంబు
ధర మోరిపురమేలు శంభు। పాద। సరసిజంబుల మానసంబు। నిల్పి
స్మరియించు కలుషంబు మఱలించు శీఘ్రంబు ॥ఎం॥

చం— కాంతా! నీవెంతబ్రతిమాలినను జింతాస్పదంబగు
కంతుకేళి కొడంబడుదునని తలఁచు కొనకుము.

ర— వ॥ అయ్యో! పరమేశ్వరా! నేనెంత బ్రతిమాలినను
దాఁబట్టినకుఁ దేటికి మూఁడేకాళ్లనుచుండెను ఇంకేమిసేయుదు పా
ణేశ్వరా! భగవద్ధ్యాన పరాయణులగు మీరెఱుఁగని సంగతు లెవ్వి
ఐననా విన్నపంబాలింపుఁడు.

క॥ సుతులంగాంచని వారికి।
గతులుండవటంచు శ్రుతులు ॥ ఘనఘోషముతో।
శ్రుతపరచఁగ వినియుండ్రి దు।
ర్గతిఁ జిక్కెడుపాపమార్గ ॥ గమనములేలా॥

వ॥ నాథా! సుతులులేనివారికి గతులులేవను శ్రుతివాక్యంబులు వినియుండియు దుర్గతిఁజిక్కి పాపమార్గమునఁబడి సంచరించెదరేల?

చం— గీ॥ ఏరొనర్చెదు పాపము ॥ లవ్వారుగాక।
సుతులు భార్యయుఁ జుట్టము ॥ లోసోదరులును।
దోడుపడుదురె దుఃఖముల్ ॥ గూడువేళ।
నెటికీయాశలుడిగి నా ॥ మాటవినుము॥

ఎవరాచరించు పాపములు వారేయనుభవింపవలయుఁగాని సుతులును భార్యయుఁ జుట్టములును సోదరులును దుఃఖసమయమునఁ దోడ్పడరు గావున నీపాపమార్గమును విడిచి సన్మార్గమునఁ బడి సంచరింపుము.

సంవాదసీసము.

ర— చంద్రబింబమునకు ॥ సరిపోల్పఁదగునీదు
మోముమోమునఁజేర్చి ॥ ముద్దొసంగు।
చం— మోముచంద్రునిబోల్చి ॥ ముదమందుచుంటివి
దుర్గంధయుతమని ॥ తోఁచదొకొ।
ర— బింబికాఫలసమా ॥ నంబగునీమోవిఁ
నొక్కనిమ్మొకసారి ॥ మక్కువగను।
చం— అధరంబుఫలమని ॥ గూళించెదవుచొంగ
నిండియుండెడిమాంస ॥ ఖండముగద।
ర— గుబ్బలికవఁబోలు ॥ గుబ్బలుబ్బెను నెదఁ
గ్రుమ్మనీయఁగరాదె ॥ నమ్మతముగ।
చం— వక్షోజములగిరు ॥ లవ్వలెనెంచుచుంటివిఁ

పలుగోళికలంచుఁ • దెలియవుగద।

ర— కరితుండములఁ గేరు • కరములునిగుడించి

కౌఁగిలింపఁగదయ్య • కాంతుఁడీటు।

చం— కరము తుండముతోడ • సరిబోల్చి మురిసెదు

నరములపోవ్రని • యెఱుఁగవేమొ!

ర— కరుణ రతిఁగూడరమ్ము ప్రభూ • వరకుమార।

చం— రతియనెడుమాట వినఁజాల • రత్నమాల।

ర— పతిసుఖములేని తనువేల • ప్రాణమేల।

చం— అకట! మలమూత్రకొంపకీ • సుఖములేల?

వ॥ రత్నమాలా! క్రిమిమలమూత్ర రక్తమాంసములతో నిం యున్న యీతోలుబొమ్మను గాంచి యేలయిట్లు భ్రమించెదవు న క హేతువగు నీతుచ్ఛసుఖముల విడిచి పరమపదవిఁజిక్కు మోక్షమా ర్గము వెదకుము,

రత్నమాలిక దరువు – ఆది – బారువరాగము.

అకటకటా విరహబాధ యతిశయిల్లెగా। నాథా। యతిశయిల్లెఁగా మకరధ్వజుని కేళిఁదేలక మనఁగ లేనుగా। నాథా। మనఁగ లేనుగా ॥అ। మారుఁడదయుఁడై శరంబులఁ దూఱనేసెఁగా। యెదఁ దూఱ నేసెఁగా॥ శారికాశుక కోకిలంబులు గేరసాగెఁగా। మిగులఁ గేరసా గెఁగా ॥అ॥ మందమారుతములనిలుఁడు గుందవీచెఁగా। మనసు। గుం దవీచెఁగా॥ చంద్రుఁడు మిన్నంటివెన్నెలఁ గందఁగాసెఁగా। మేను గందఁగాసెఁగా ॥అ॥ నారినిటుల దుఃఖపెట్ట మేరగాదుగా। పతికి। మే రగాదుగా॥ ధారుణీశ్రీమోరినిలయుని దలఁతుభక్తిగా మదిని దలఁ తుభక్తిగా ॥నకటకటా॥

నాథా! యీవిరహానలజ్వాలకు నాశరీరమింధనముపగిది మా డుచుండుటయేకాక చెవులుగూడ ఘడియులువడుచున్నవి ఇక నెట్లు తాళఁగలను? దీనురాలనైన నావిన్నపమాలింపుఁడు

చం— కాంతా! నీవెంతబ్రతిమాలినను నేనాకామాద్యరిప

స్వర్గము పాలఁబడుదునని కలలోనైనం దలంపవలదు.

ర— నాథా! కామవిహీనులైనచో సరణ్యమున కేగి యాకములఁ దినుచు మునివృత్తినుండవలెనుగాని నన్ను వివాహంబాడి విడువరాని దుఃఖముల నలయించి స్త్రీహత్యకేల పాల్పడవలయును.

చం— పెండ్లి యందుజరిగిన చేతలన్నియుఁ బ్రభువునకర్పణమైనవని తెల్పినను వినక పెండ్లి యాడితివి పెండ్లి యాడితివని పల్కనేటికి?

ర— హా! పంచశరా!! హా! కుముదబాంధవా!! హా! మలయానిలా!! యిఁక మీయిష్టము వచ్చినట్లు వేధింపుఁడు. చచ్చిన వారిపై నెన్నిబండ్లు పోయిననేమి? విరహబాధ యంతకంతకు నతిశయిల్లుచుండె నేనిట్లుదుఃఖించిన ఫలితమేమి? ఈపంచశరునిచేఁ జచ్చుటకన్నఁ బతిచేతిలోనే హతమగుట శ్రేయముగదా? నాథా! మీరేమిచేసినను జేయుఁడు. మిమ్ము బిగియారఁ గౌఁగిలించి మదనకదనము సల్పక విడుచుదాననుగాను. (అని కౌఁగలింపఁబోవును)

చం— (తప్పించుకొని) దరువు – ఆది – హిందుస్తానికాఫీ.

తాళుతాళు చేరరాకు। బాలికామణీ। కేళిఁ జేలఁజేరుఁ బాపపాళి భామిని ।తా॥ వలదఁటన్న వినవదేల। కలుమకార్యము। నలలితముగ శివుని। గూర్చినల్పు ధ్యానము ॥తా॥ ధరాసుఖము లనిత్యమంచుఁ దరుణినమ్ము మా। పరసుఖములు నిత్యమంచు భ్రాంతిఁజెందుమా ॥తా॥ పాపరహితుఁ జూచియముఁడు ప్రణుతిసేయుఁగా। పాపభర్తుఁ జూచిమిగుల। బాధపెట్టుఁగా ॥తా॥ ఇలవెలసిన మోరిపట్టణేశు సాక్షిగాఁ। జెలుల గూడినరక బాధఁజెందఁజాలఁగా ॥తాళు।

వ— సుందరీ! నీవెంత బలవంత పెట్టినను దిగ్జగద్రక్షకుఁడగు సర్వేశ్వరుని పాదసాక్షిగాఁ జింతలందగులు కంతుసంతాపమునకు నాయంతరంగ మొడంబడదు. కావున నాదరిఁ జేరకుము.

ర— ప్రాణేశ్వరా! నాయంతరంగ మంతకంతకుఁ గంతుసంతాపమున మ్రగ్గుచుండుటయేకాక,

సీ॥ దడదడమంచునా • యొడలుదూలుచునుండఁ
జేపట్టియాపవే • భూపవర్య!
దగఫ్రట్టినాజిహ్వ • యిగిరిబీఁటలువాసె
సధరామృతంబిచ్చి • యతుకుమయ్య!
మెడపట్టువిడిమెదఁ • బడఁగసాగెశిరంబు
నాలింగనంబిచ్చి • యాపుమయ్య!
కనులుచీఁకటిగ్రమ్మె • గర్ణముల్ ఘడివడె
ముద్దిచ్చునెపమున • బోవ్రుమయ్య॥

గీ॥ కాలుసేతులశక్తిచేఁ • గదలకుండె।
ప్రాణముల్మనసిల్వక • పాయఁదొడఁగె।
హా! దయానిధి! హా! ప్రాణ • నాథ! వేగ।
వచ్చిరక్షించురక్షించు • వసుమతీశ?

(అని మూర్ఛిల్లును)

చం— మేలుమేలు. మాతృదోష మంకురింపకుండ నేనిప్పటికిఁ గృతకార్యుండనైతి. ఇఁక నేనీ సమయమున నీమెకుఁ గాన్పింపకుండఁ బోయినచో నన్నుఁ గానక కొంతవడుఁ జింతించి తుదకీపెట్టెనుఁ దెఱచి యందున్న బాలకుని వానిమెడనున్న వృత్తాంతపత్రికను జూచి నిజము తెలిసికొనును కావునఁ బరులెఱుంగకుండ మా . రంబునకుఁ బోయెద (అని నిష్క్రమించును)

ర— (లేచి) ఆహా! నానాథుఁడెచ్చటనుఁ గాన్పింపకుండెనెందులకేగెనో కదా.

దర్వు – ఆది – నాదనామక్రియ

ఎటకుఁ జనియుంటి వింతలోఁ। బ్రాణనాయక ॥యె॥ కటకటా నన్నీ విరహా। ఘనతరాగ్నిం బడఁద్రోసి ।యె॥ పతియె దైవమటంచు। భావించిమీపదములు। సతిభక్తిఁ బూజించిన నాదరింపక నీవు ॥ఎట॥ సతులదుఃఖంపఁజేయ। బతులక శ్రేయమయ్య! యతనుబారి మాన్పనీ। పతిత్వరితముగ రావయ్య ॥యె॥ ధారుణీ మోరిష ర। ధ ముద్దై

పట్టిచింతా। వీరభద్రవరదుని వేడిన దయచూడక ॥మె॥

ఉ॥ ఎక్కడికేగెనో యెడయఁ • డేమిదలంచెనో యెందుడాగెనో।
మక్కువఁ గౌఁగిలించినను • మన్మథకేళినిదృప్తిఁ జేయకే।
ఫక్కని దత్త్వబోధలను • బల్మరు జేసియుమూర్ఛపుచ్చి; యే।
చక్కనిజూచినట్టి ధవుని • జాడగనంబడ దేమిమాయయో॥

వ— హా! దైవమా! నానాథుఁడెటకేగెనో కదా? లేదు లేదు. ఇదిగో వారియిష్టదైవముగల మందసమిచ్చటనే యున్నది, ఆయన నిశ్చయముగా వెళ్లినచో వారియిష్టదైవముగల పేటిక విడచి యెట్లుపోవును. నిజముగా నామనంబరయుటకై యీసమీపముననే దాగియుండవచ్చును. ఐననానాథుఁడు వచ్చునంతలో వారియిష్టదైవమున నెట్టిదో చూచెదను (అని పెట్టెను దెఱచి) ఆహా! యిదియేమివింత? యిందులకీబాలకుం డెటనుండివచ్చె? నానాథునకీ డింభకుఁడిష్టదైవమెట్లయ్యెను? పెట్టెను దెఱువఁగనే వీనితేజోరాశి దశదిశలు ప్రకాశించుచుండె.

గీ॥ వీని వీక్షింపఁ బురిటిలో • వానివలెను।
గానుపించెను; జిఱువగ • వాననమున।
నొప్పుచును శశిదీప్తిని • గప్పి తేజ।
మొంది నాడెంద మానంద • మొందఁజేసె॥

ఆహా! యీబాలకునిఁజూడఁ బురిటిలో వానివలెఁగాన్పించుచుండుటయే గాక వీనిసౌందర్యము నాడెందమున కానంద మొందఁజేసెడిని. ఓహో! యిది యేమివింత? యీతనిమెడ నేదో పత్రిక గన్పట్టుచుండె. విప్పిచూచెద (అని పత్రికను విప్పిచదువును)

హా! పరమేశ్వరా!! హా! జగద్రక్షకా!!

దర్వు – అట – జాలికాంబోది.

పదిరెండుదినముల బాలునిఁ దెచ్చినా పతిఁగా సమకూర్చితివా।
ముదమునఁ భర్తతో। ముచ్చటాడుకోక। సదయ నేఁడు ద్రుంచితివా॥పది॥
బాలుగోరఁగలేని। బాలునితోఁగాఁపురము। నేలీలసేయఁగనోపుదు॥

పాలసుఁడగువిధి నా। ఫాలభాగమునందు। మేలెంచకిటువ్రాసెఁగా॥పది
అయ్యోనాయావన। మడవిఁగాసినవెన్నె! లట్టులవ్యర్థయయ్యెఁగా
చయ్యనవోరిపుర। సర్వేశమమ్ముల। సాఁక భారముఁ దెగా ॥పది॥

అయ్యో దైవమా! యీబాలకుని మోసముచే నాకు భర్తఁగా జేసినవార్త మాతండ్రికిఁ దెలిసినచోఁ జంద్రచూడుని బుత్రమిత్ర కళత్ర బంధు సేనా మాత్యసహితంబుగాఁ బట్టి వధింపక విడువఁడు నేనిదిచెప్పినచోఁ వారికిహాని సంభవించుటయేకాక నాకులాభ మించు కయుఁగలుగదు. చూడంబాడ నీబాలుఁడీశ్వర ప్రసాదమునజన్మించె ననియు నాయుర్వృద్ధికై యిట్లు చేసిరనియు నీవ త్రిక చెప్పుచుండ నీబాలుని విడుచుట ధర్మముగాదు. అదియునుగాక,

గీ॥ అగ్నిసాక్షిగఁ బరిణయ • మాడినట్టి।
పురుషుఁ డెటువంటి వృద్ధైన • పోకిరైన।
ద్రోహియైనను దుర్బల • దేహియైన।
సతివలాతని విడువ రా • దండ్రిబుధులు।

కావుననీబాలుని బోషించుకొనుచు నరణ్యమునవసించెద. లేకున్న మాతండ్రికీవార్త తెలియకమానదు. కావున నేనరణ్యమున కేగెద.

దరువు — ఆది — ముఖారి.

వెడలెను గాననుండుటకును। సింహకేతు పుత్రిక ॥వెడ॥ వెడల
ధవునిఁదన। యొడిలోని కొని। నడిరేయినిబర। నరులకుఁ దెలుపక ॥వెడ
పతియే దైవంబని భావించి। యెంతకష్ట మొందిన। నతనిఁ బోషింప
మదిలోనెంచి। సతతముతన్నతి। హితవుగఁ బ్రోచెదు। పితరునిపైఁగ
ల ప్రేమముఁదుంచియు ॥వెడ॥ సరసీరుహ సంభవుఁడీకతి। నుదుట
వ్రాసెనంచుఁ బరిపరివిధముల దూషించి। ధరణిమోరిపుర ధాముని
మృదుపద సరసిజములమది మఱువక తలఁచుచు ॥వెడ॥

(ఇట్లరణ్యము ప్రవేశించి) ద్విపద.

అయ్యయ్యో! పరమేశ! • హా! జగదీశ!। ఇయ్యరణ్యంబున • నెటు
సంచరింతు భుజఁగముల్ క్రూరత • బుసఁగొట్టఁదొడఁగె। గజములు

గుంపులై ◆ గమనించసాగె। కొదమసింగంబులు ◆ ఘుర్ఘురముల్వగుచు, రొద సేయుచుండెను ◆ రోషంబుతోను। పులులుగాండ్రిమనుచుఁ ◆ బొదలనువిడచి। పలుతెఱంగులఁబడి ◆ వసువిడుచుండె। కటకటాయీభయం ◆ కరగర్జనముల। కిటఁబ్రాణినిల్వదిఁ ◆ కెవ్వరుదిక్కు—॥

హా! పరమేశ్వరా! యీక్రూరమృగ గర్జనములకు నాశరీరము నిలుపున నీరువాఱుటయే కాక ప్రాణిసహితము మేననిలుచుట దుస్తరముగా నుండెనుగదా.

దర్వు — ఆది — శహాన.

ఎటుల సంచరింతునే। కటికి ఊళ్లలోఁబడి। మటుమాయవిధిన। న్నిటుల బాధింపఁ దొడఁగె ॥నె॥ అడుగిడి నడువఁబోవ। నంతనెముంళ్లుదాఁకి యెడ తెగక రక్తము వెడలసాగెనయ్యయ్యో ॥ఎ॥ అడవిఁగల క్రూరమృగము। లార్భాటములు సేయ। దడదడ మనుచునా। యొడలెల్లవడఁకసాగె నెటు॥ ధార్మిణీమోహిపుర। ధామున్‌డైనట్టిచింతామరిభద్రవరదుఁడీ। బారిఁబడఁద్రోసెనింక ॥నెటు॥

అయ్యయో! పరమేశ్వరా! భయంకరమగు నీయరణ్యమునఁ బడఁద్రోసి నీవుకానట్లూఱకుంటి వింక నే నేమి సేయుదు.

(అంతఁ జంద్రికాంతుఁ డాఁకలిచే నేడ్చును)

ర— గీ॥ అయ్యయో నాదుప్రాణేశుఁ ◆ డాఁకటఁబడి।
యడలఁ దొడఁగెను శరీరంబు ◆ లడవియందు।
నెట్లుసమకూర్పఁ గలదాన ◆ నిదియుఁజూడ।
గాయమున క్షారమంటిన ◆ కరణినుండె॥

హా! భగవానుఁడా! గాయమునుప్పుపొడి వడు వడువున నడువ నికఁ ఇడుమలఁబడు నాయందక్కటికముంచక బుడుతనిసహిత మే పించవలయునా?

దర్వు — అట — జాలికాంబోది.

ఆఁకట రాపట్టి యడలుచునున్నాఁడు। సాకరేమఁధువిచ్చి। మాప్రియ రా ॥ఆ॥ దైవముగాఁబతిని భావించివచ్చితిఁ। బ్రోవశేవాలిచ్చి

యాపులారా ॥అ॥ మకరందమిచ్చి డింభకునిఁబోషింపఁగ బ్రతికటంబుగరారే భ్రమరంబులారా ॥అ॥ ఆపదఁబడునాపై సక్కటిక ముంచి కాపాడరారేమో ఖగములారా ॥అ॥ ధరణిలో శ్రీమోరి పురనిలయుఁడగుసర్వే శ్వరుఁడైనవాలించి వరుఁబ్రోవఁడాయె ॥అ॥

అయ్యయ్యో దైవమా! నేనెంత బ్రతిమాలుకొన్నను నీయరణ్యంబుననున్న తరుజంతువులెవ్వియు మాటలాడవయ్యె. నేనేమిపాపము సర్చితి. నీరాకుమారునొకటి నేకరణింబాపుదు.

గీ॥ కటకటా ప్రాణనాథుఁ డాఁ • కటనునింత।
వఱవనేడ్చియు నిప్పుడే • డ్సంగశక।
వాడుపాఱినపూఁదీగ • వలెను మేను।
వ్రేలఁబడియును గన్నులు • విప్పకుండ॥

ఆఁకటిచే నీరాకుమారుఁ డేడ్చియేడ్చి యిప్పుడేడ్చుటకు సహితము శక్తిలేక వాడుపారిన పూఁదీగచందంబున వ్రేలఁబడి కన్నులువిప్పి చూడకుండె నీకనెట్లోకదా! నాథా! నీనేత్రకమలములు వికసింపఁజేసి నన్నొకసారివీక్షింపుము. అయ్యయ్యో యేమిది. (అని గుండెలు బాదుకొనుచు)

ద్విపద.

హాప్రాణనాయకా • హాసుకుమార। ఏపగిదికైనను • నెవ్వరుదిక్కు। పున్నమచందురుఁ • బోలునీ మోము। గన్నంతలోఁగానె • కాంతివిడప్పి। హీనమైపోఁ జేసె • నేమిరాఁగలదొ। మానవేశ్వరయింక • మనఁగఁజాలనుగ। ముందెప్పుడోనన్ను • ముచ్చట నఁ। బొందికోరు లుదీర్చి • ప్రోచెదవంచు। నీరాసచేనున్న • ప్రియురాలినిట్లు। వేఁబు ఁజూచియు • విడువనెంచితివె॥

వ— హా! ప్రాణనాయకా! చూచుచుండఁగనే నీముఖారవిందమంతకంతకుఁ గళావిహీనమైతోఁచుచుండె నీ కేమిసేయుదు. నీ వెప్పుడో నవవయస్కుఁడవై నామనోరథ మీడేర్తువని నీరాసనున్న నన్ను వేఁబుసేయ నెంచితివా? హా! పరమేశ్వరా! హా! భక్తరక్షకా!

క్షుద్బాధచేఁ గృశించుచున్న నానాథుని బ్రోవకున్న నాకిక దిక్కెవ్వరు?

దరువు — ఆది — కాంభోజిరాగము.

ప్రోవు ప్రోవు పార్వతీశ్వరా। క్షుధఁ దీర్చి నాథుని ॥బ్రో॥ ప్రోవు ప్రోవు పార్వతీశ భుజంగభూషణ మహేశ। యౌవనమునఁ బేరాఁకటి చేత నేడ్చి కదలక పడిననాథుని ॥బ్రో॥ పతియే దైవమంచునాడు। మతి మోహఁ జేసియు మాతా। పితరులసహితము విడిచియా। గతినిడుమలఁ బడునతివను ననుగని ॥ప్రో॥ ధారుణీశ్రీమౌరిపుర। ధాముఁడవంచునీ పాద। నీరజములునమ్మి సారె। సారెకునుతియించుచుంటిని ॥ప్రో॥

( అప్పుడు శంకరునిపంపున నశ్వినీదేవతలు ప్రవేశింతురు )

దరువు — ఆది — కాంభోజిరాగము.

ఆశ్వినేయు లరుగుదెంచిరి। రత్నమాలచెంతకు ॥నాశ్వి॥ ఆశ్వినేయులరుగుదెంచి। శివ్వరాజ్ఞఁ గైకొన భూ। మీశ్వరసుతునిరక్షించి। శాశ్వతారోగ్యమొసంగ ॥నాశ్వి॥ సతతమమత ఘరమునమండియు। భిషగ్వరులంచు। నతులిత సత్కీర్తిఁ బడసియు। మృతశరీరులకైన నమృతదానమొసఁగియువారి। బ్రతుకఁజేయఁ జాలుపరమ। పావన చారిత్రులైన ॥నాశ్వి॥ అరసిన వారినేత్రంబులు। మిఱుమిట్లుగొల్పు। సురచిర తేజోశరీరులు। ధరణిశ్రీమౌరి పురనర్వ। శ్వరునినామమును మరువక। నిరతముస్మరియించుకొనుచు। నింగినుండి భూలోకమునకు ॥నాశ్వి॥

ర— (అశ్వినేయులంగాంచి) ఆహా! నాకనులకు మిరుమిట్లుగొల్పు దేదీప్యమానములగు దేహకాంతులుగల్గి దేవతాసంజాతులననొప్పుచు నాపాలిటి భగవంతులవలె వచ్చినమీకిదే నమస్కరించుచుంటిని. ఆఁకటిచే డస్సియున్న యీరాకుమారుని యాఁకలిఁదీర్చి రక్షింపుఁడు.

అశ్వినేయుల ద్విపద.

చెలిసీకు ధనదుని ॥ చెలికానికృపను। చెలువుఁడయ్యెను జంద్ర ॥

శేఖరసుతుఁడు। ఇతనికాయువుపూర్వ ♦ మిపదినాలాటు। పతినిన్నుఁ జేసి
న ♦ సంపూర్ణజీవి। యగునని శంకరుం ♦ డభయమొసంగ। మగనిఁగాఁ
జేసిరి ♦ మదిలోనఁజింత। విడువుమీ యిసుమలు ♦ వెడలంగఁ జాలు।
కడుపడినమ్మ మీ ♦ కాంత! యీమాట। ముందు నీధవునితో ♦ ముచ్చ
టడీఅ। పొందెదు సుఖములు ♦ పొలఁతికోమిమ్మ! నాఁకలి దప్పులు ♦
నలయించ లేవు! ప్రాకటంబుగ నాథు ♦ భక్తిసేవింపు। మిదె యిడెదముసు
ధ ♦ నిచ్చునుంగరము। సదయతఁ గైకొని ♦ సఖునిబోషించు॥

రత్నమాలికా! యిదియంతయు విధికృతమునజరిగె దీనికింత విచారింపనేల? ఇఁకనీవీకష్టవారిధి లంఘించి పతితో సకలసౌఖ్యము లనుభవింపఁగలవు. ఇదిగో! నమృతమొసఁగు నీయుంగరము గైకొని యొకటి సమయమున నీపతినోటికందిచ్చుచుఁ బతినిబోషించుకొనుము.

ర— చిత్తము. మీయాజ్ఞ శిరసావహించి యట్లుచేసెద. ఈ నాథవుఁడు సకలవిద్యా విశారదుఁడగునట్లు వరమొసఁగుఁడు. నాకీయు పకారమొనరించిన మీనామంబు లెత్తింగించి వీనులకుఁ బండువసేయుఁడు.

ఆ— క॥ వినుమశ్విని దేవతలము।
అనలాక్షుని యాజ్ఞనిచట ♦ కరుదెంచితి మీ।
జననాథసుతుఁడు గురుద।
ర్శనమొందిన సకలకళల ♦ సంపూర్ణుఁడగున్॥

రత్నమాలికా! మేమశ్వినీదేవతలము. నీప్రార్థనలకా శంకరుఁడు కరుణించి మమ్మఁ బంపఁగా వచ్చితిమి, నీనాథుడు గురుసందర్శనమాత్రమున సకలవిద్యా విశారదుఁడును ధైర్యసాహసాది గుణంబులు గలవాఁడును నగును.

ర— గీ॥ ఆపదంబుధిలోమున్గి ♦ యోపలేని।
కష్టమొందెడు ననుఁజూచి ♦ కరుణయనెడు।
తెప్పనెక్కించి దరిఁజేర్చి ♦ తిరిరయమున।

సహహా! నాపూర్వపుణ్యామే • మనఁగవచ్చు॥

అశ్వినీదేవతలారా! ఆపత్సముద్రమున మునింగి కడు నిడుమలఁ బడునన్ను మీకృపయనెడు తెప్పనెక్కించి తీరముఁ జేర్చితిరి. ఇఁక నేను ధన్యురాలనైతిని.

అ— ఓపతివ్రతాతిలకమా! మాకు సెలవిమ్ము మాతావునకుఁ బోయెదము.

ర— మీసేవకురాలనగు నాపై నిరంతరముకరుణయుంచుఁడు

అ— సంతతానంద సౌఖ్య ప్రాప్తిరస్తు. (నిష్క్రమింతురు)

ర— అహా! నాభాగ్యమేమనవచ్చు. భగవంతుఁడు దయాళుఁడై రక్షించె. ఇఁక క్రూరమృగ పాముల వలనను మృగంబులవలనను భయములేదు. అశ్వినీ దేవతలిచ్చిన యుంగరము నానాథుని నోటి కందిచ్చెద (అట్లుచేసి)

గీ॥ ఉంగరంబున సుధఁగ్రోలి • యూపిరినిడి।
యంతకంతకు నానాథుఁ • డంబుజముల।
కరణివికసింపఁజేయుచుఁ • గన్నులిపుడు।
తెఱచి చూచుచునుండెను • దిశలనెల్ల॥

బాగు బాగు నానాథుఁడంతకంతకుఁ గనులువిప్పి చూచుచుండెం గావునఁ గొంతకాలమీ నూతన పత్రములచే నిండియున్న వటవృక్షము క్రింద నివసించి పతిని బోషించు కొనుచు నీవేసవికాలము వెళ్ళఁ బుచ్చెద.

{ ఇదియిట్లుండ రత్నమాలికా చంద్రికాంతులం గానక
కాంచనాపురిలో సింహకేతుఁడు చింతించుట. }

దర్వు – రూపకము – అసావేరి.

ఎక్కడికి నేగిరో నా। మక్కువ కొమరితయునల్లుఁ ।డెక్క॥ ఎక్కరణిందాళుదునే నెవరిఁ జూచికొందు మంత్రి ॥యెక్క॥ మదనుఁడు రతివలె నిరువురు। మనుదు రనుచు నూహించితి నిది కష్టమొ విధికృతమో. యెఱుఁగరాదు మంత్రివర్య ॥యెక్క॥ ముదితలు గమిగూడి

రాత్రి ముదమునఁ బడకిల్లుజేర్చి। యుదయము లేవని కతమున। గది
వెదకినఁ గనుపింపక ॥యెక్క॥ అల్లుఁడు బోధించి తనయ। నతని
పురికిఁ గొంపోయెనో। తల్లి దండ్రుల మగుమాకుఁ। దనయుఁడైనఁ దె
ల్పకుండునా ॥యెక్క॥ సతిపతులిరుపురకు మైత్రి। సంఘటిల్లెను। పౌర
వచ్చెనో। యతిసుగుణసుశీలనాడు సుతపతికెదురాడనోపునె ॥యెక్క॥
మతినిల్వదు నాకుఁగన్న।మాతయెట్లు తాళఁగలదు। క్షితివెలసినమారి
పుర స। ర్వేశుని దయలేదు మంత్రి ॥యెక్క॥

మంత్రీ! నాకూర్మి పట్టియగు రత్నమాలికయు నాయల్లుఁడగు చంద్రికాంతుఁడును నెచ్చటకేగిరో యేమైపోయిరో తెలియకున్నది. ఏమిసేయుదును ఎట్లు తాళుదును.

మం— సింహకేతు మహారాజా! మీరిట్లు విచారింపనేల? శాంకరీ వరప్రసాదమునఁగల్గిన మనరత్నమాలకే కొంతయు వాటిల్లదు. అదియునుంగాక వరమిచ్చుతఱి దీర్ఘసుమంగళిగా నుండునని పల్కిన శాంకరి వచనంబులంబట్టి చంద్రికాంతునకును గీడుమూఁడదు వేయేల? ఆదంపతు లెచ్చట నుండినను సురక్షితులుగానే యుందురు.

ద్వా— (ప్రవేశించి) రాజా! జయమగుఁ గాక.

సిం— ఏమిరా, సమాచారము.

ద్వార— మీదర్శనమునకై నారద మహాముని ద్వారముకడ వేచి యున్నాఁడు. సెలవైనఁ బ్రవేశ పెట్టెదను.

సిం— శీఘ్రముగఁ బ్రవేశ పెట్టుము.

(నారదుఁడు ప్రవేశించును)

దరువు - ఆది - కళ్యాణి రాగము.

నారదమౌనివచ్చెను। సింహకేతుకొలువుకు ॥నా॥ నారదమౌనివచ్చె
నారాయణహరియంచు। పేరురమునఁదొళసి పేరులు దాల్చివేగ ॥నా॥
కరమున దండమిడుకొని। కావివస్త్రములఁగట్టి। శిరమున జడలుజుట్టి।
శ్రీహరీ! కేశవ! యనుచు ॥నార॥ ధరణిలోశ్రీమోరి। పురమునవెలయు
సర్వే। శ్వరుని మిత్రుఁడైన కం। సారినామములు నుడువుచు ॥నా॥

సిం— ( నారద మానింగాంచి )

క॥ వందనము, సేతునిదా జన
వందిత! యీపీఠమందు • వసియించి మనం
బందుఁగల దిగులు డిపియా
సందముఁ గావింపుమయ్య • నారదమానీ॥

మునీంద్రా! వందనము. మీరీ సింహాసనము నధివసించి నాయంత రంగమునం గల చింతను దొలఁగించి సంతసముఁ గావింపుఁడు.

నా— సుఖీభవ, సుఖీభవ. (కూర్చుండి) రాజా!నీవిచారము నకుఁ గారణమేమై యుండును?

సిం॥ ఉ॥ సంతతిలేక లేకహరు • జాయవరంబునఁగూఁతుఁగాంచియు,
గాంతునిఁగూర్ప నెంచిశశి • కాంతునకిచ్చియుఁబెండ్లి సేసియా,
కాంతనుఁగాంతునింగలియఁ • గానొనరించియునేఁడుజూడఁగా,
వింతయొమాయమోమొఱుఁగ • వీరలఁగానక చింతనొందితి॥

నారదమునీంద్రా! సంతతి లేక లేక చంద్రకావర ప్రసాదంబున నొక కూతుంగాంచి చంద్రికాఖ్య జూడగు చంద్రికాంతున కిచ్చి వివాహ మొనర్చి యాదంపతుల శయనాగారముఁజేర్చి యుదయము నజూడ నది యేమి వింతమోఁగాని వారిరువురుఁ గాన్పింపరయ్యె. అప్పటినుండియు మిక్కిలి చింతనొందు చుంటిని ... రుత్రిజగత్సంచారులు మీకుఁదెలియరాని దెద్దియు నుండదు. కావున నాదంపతు లిరువురు నేమైపోయిరో యెచ్చట నుండిరో తెలియం జేసి నాచింతం దొలఁగింపుఁడు

నారదుని సీసము.

వినుదైత్యనాయక • తనయులుకప్రమి
జర్ఁదమూడుండుర • గేదభ్రరుని।
భక్తినర్చనసేయఁ • బ్రత్యక్షముగవచ్చి
పదిరెండుదినముల • బాలునీయఁ
జింత చేఁగుందుచుఁ • జిరత రాయువుగోరఁ

బదియు రెండేడుల ♦ పడతిఁ దెచ్చి।
పరిణయ మొసరింప ♦ బాలున కాయువు
పూర్తిగాఁ గలదని ♦ పురహితుండు।
చెప్పిన విని నీదు ♦ చిన్నారి తనయను
మోసంబుగాఁ బెండ్లి ♦ జేసి రాత్రి
పడక టింటికి మంత్రి ♦ కొడుకును బంపింపఁ
దత్త్వార్థమెఱిఁగించి ♦ తరుణి మూర్ఛ॥

గీ॥ నొంద జేసియు గాసుతుఁ ♦ డుండు పెట్టె।
నచట నుంచియుఁ బోవఁగ ♦ నతివ లేచి।
పెట్టెఁ దెఱచియు బాలుని ♦ బెనిమిటిఁగను।
నెత్తిగి పతిఁ బెంచుటకు వని ♦ కేగె నపుడు।

రాజా! నీ కీవార్త దెలిసినచోఁ జంద్రచూడున కేమి కీడొనరింతువో యను భయమున నీకుమార్తె పెనిమిటి నొడిని డుకొని యడవుల కేగి పెక్కు-డుమలఁ బడుచుండె నిదియే సమాచారము. ఇఁక నాకాజ్ఞ యొసఁగుఁడు. నే నేగుచుంటిని. (అని నిష్క్రమించును)

సిం— అహో విద్యున్మాలి విరూపాక్ష వికచలోచనాది ప్రధానులారా! విశ్వాస ఘాతకుండగు చంద్రచూడుఁ డొనరించిన మోసమును వింటిరా?

మం— దేవా! అది యెద్దియో యెఱింగింపుఁడు.

సిం— ఓ విద్యున్మాలి, విరూపాక్ష, వికచ లోచనాది మంత్రులారా!

దర్వు – ఆది – నాట.

వినుఁడీ తెలియఁ జేతుఁ। జంద్రచూడు మోసము ॥విను॥ మనమున జంకిసుమంతయు లేక యె దనుజపతి నిన గుననుఁ గపట మొనర్చె ॥విను॥ ద్వాదశదినము లాయువుగల। నిసువు పెండ్లిఁ జేయ। బోధఁ జేసి మంత్రిని బంపఁగా॥ నాదు కుమారిత నీదలఁచియు జన। నాథుని సుతుపట మేదన వే ఊొకటిడె ॥విను॥ పరిణయ తరుణ ౦ందున। మిమఁ బన్ని నిసువు

దుఁ బరిణయమైన శ్రీ గొబ్బున॥ దురిత చరితుఁడౌ నరుఁడొనరించి
॥ దురితము నాకర శరమునఁ బాపెద ॥విను॥ మదిని గ్రోధముదీఱఁ
గా॥ మోరినగర నిలయుని॥ పదద్వయముల సాక్షిగా॥ పదఁక యూరి
పు పదమణఁచియుఁ గారా॥ సదనము నుంచెద సత్వరితంబుగ ॥వి॥

వ — మంత్రిలారా! మాయావియై చంద్రచూడుఁడు మన
కొనరించిన వంచనకు నాయంతరంగం బెంతేని వేధించుచున్నది. ఆహా
మూకపటుని నికటమునకు హుటాహుటిం జేరి మత్కర శరఘాతల
నాతని నొప్పింపక నాక్రోధముదీరదు. కావున సత్వరము సేన నాయత్త
పఱపింపుఁడు.

చా — చిత్తము.

(ఇట్లాయత్తపఱుపఁబడిన సేనతో సింహకేతుఁడు దాడివెడలుట)

దర్వు - ఏక - యమునా కళ్యాణి రాగము.

రండురండ మాత్యులార॥ యామోదపురికి ॥రం॥ రండురండ మా
త్యులార, రయమున నాచంద్రచూడుఁ॥ కండకావరం బడంచి కారా
గృహబద్ధు॥ జేయుదము ॥రం॥ కుత్సిత భావమునవాఁడు॥ కొమరిత సు
ఖమెడలఁజేసి ధీ॥ భత్సమగు సరణ్యమునకుఁ॥ బంపిన శశిచూడుఁ బ
ట్టుటకు ॥రం॥ ధారుణి శ్రీమోరి నగర ధాముఁడై నట్టి చింతా॥ విర
భద్రవరదు పాద॥ నీరజములఁ దలఁచుకొనుచు ॥రం॥

సిం — మంత్రిలారా! యిదిగో మనమామోదపురపు పొలి
మేరకు వచ్చితిమి. నేను ముందుగాఁబోయి కోటలోఁ బ్రవేశించెద.
నావెనుక మీరొక్కరొక్కరుగా రండు. మన సైన్యంబులఁ గోట న
లుతట్ల వ్యాపింపఁ జేయుడు. (అనికోటలోఁ బ్రవేశించును)

చంద్రచూడుఁడు సింహకేతునిఁజూచి) ఆటవెలఁది

చం — రండు బావగారు • రత్నపీఠికపయి॥ నధివసించి మీర •
లరుగుదెంచు॥ కారణమును - దు • కాంతయుజామాత॥ సుతకుశలమె
తెల్పు • సుగుణవర్య॥

ఓ బావగారూ! రత్నసింహాసనము నధివసించి (అర్థోక్తిలో)

సిం— అహా! యోరిరాజ కులకళంకా!

కందార్థము.

ఓరోరి తుచ్ఛమాధమ! యోరీ విశ్వాసదూర యోదుశ్చరితా! యోరీ కృత్రిమమునరా! కూరిమిసుతఁ బురిటిలోని! కూనను బెండ్లి! జేసియు ధైర్యా! మాని యోమొండి! మానసమున జంకు! మాని యించుకనైన నానలేకయెవచ్చి! ననుగౌరవించెద! వో నరాధమ యీశరమునీ! యురమునను నాటించి రుధిరముఁ! బానముగఁ గైకొన క క్రోధము! వాయదుర యోచంద్రచూడ ॥కూ॥

వ— అహా! యోరిచంద్రమాడా! కపటమున నొకనిపటము నావికటమున కనిపి వేఱొక శిశువునకు నాసుతను బాణిగ్రహణము గావించి యెఱుంగని వానితెఱంగున మఱియుకుశల వార్తలడుగుచుంటివి. ఆహా! యోరిబాలిశా! నాకర వాలంబున నీయురంబు చీల్చి, తదుధిరంబు పానంబు సేయక నాక్రోధంబెట్లు పాయును?

చంద్రచూడుని నీసార్థము.

ఒసింహకేత్వాఖ్య • యోదనుజాధమా
క్రోధఘూర్ణితుఁడవై • కూయనేల!
సుతునికొఱకుస్సైామ • పతినాథుసేవింప
సుతునిచ్చియునుకాని • కతిరయమున!
పదియురెండేడుల • పడఁతి నుద్వాహంబు
చేసినమనను వి • శేషకాల!
మనిపల్కవరమిడ • నటుచేసితినిగాని! యపరాధమనఁగ నేల

రా! నీకూర్మిపట్టిని! గపటము సేయలేదురా! చపలాత్మ దీనికీవు! సమ్మతిజెందకుంటె! నిపుణత్వమున రణము! నిల్చి సల్పెదరమ్ము ॥అ॥

ఓరోరి రుధిర పానమత్తా! వేలయీ లీలకాఱులు ప్రేలెదవు. ఈశ్వర ప్రసాదంబున నిట్లుజరిగె. దీనికి సమ్మతించితివేని పొమ్ము. లేకున్న యుద్ధమ్మునకు రమ్ము.

సిం— ఆహా! ఘోరి కపట నరాగ్రేసరా! యుద్ధమునకు సిద్ధము కావలయునుగా?

సంవాదదరువు – ఆది – యమున రాగము.

సిం— రారాచంద్రిచూడ। నిను। రణమునఁ బరిమార్తుమూఢ ॥రా॥ ధీరతఁ బల్కెదవు నీమద। తిమిరమణఁచి యముని జూపెద ॥రా॥

చం— పోరాసింహకేతా। యిఁకఁ। బొలిసెదవు నా చేతఁ గూర్చిర, నాశరఘాత। లకుఁ। గుర్తింపనటుల వార్చెదాత ॥పోరా॥

సిం— అహహా! ఘోరణ భీరువా। నను। హతమొనర్తువ మానవా। ఇహముననను। గెలువఁ। గల। యహితు లున్నారఁటర తులువ ॥రా॥

చం— దంభమేలదనుజ! నీ। దర్పమణఁచి నానిజ। అంబకల భానుజ। పుర। మంపెదనో పలలభోజ ॥పో॥

సిం— ఇదిగో వేతుశరము। నిన్నిఁక విడువనుక్షణము। వదన గుహభీకరము। నీకి। వదలుముసద మదము సిద్ధము ॥రా॥

చం— వృథాశౌర్యముశేల। యొకి। వ్రేటున నవలీల। వధఁ జేసెదఁగేల। నున్న। వాఁడిబాణజాల। ముల ॥పో॥

సిం— ఇలవెలసినమోరి। పురా। ధీశునిమదిఁగోరి। నా। యలుకదీరఁబోరి। యొకి। యలుఁగున సమయింతునోరి ॥రా॥

( చంద్రిమాంతునితో యుద్ధముచేసి వానిసిగ నొడిసిపట్టి )

వ— ఓరోరి విశ్వాసఘాతుకా! యిదే నాచేతఁజిక్కితి విఁక నెందుపోఁగలవు. నీవొనర్చిన మోసంబునకు నాశరంబుచే నీశిరంబు దుంచి యవనీతలంబునఁ గూలనేసెద (అని నఱకఁబోవును)

మం— (అడ్డుపడి) శాంతింపుఁడు. శాంతింపుఁడు. మన రత్నమాలికా చంద్రికాంతులు వచ్చువఱకు నీ తుచ్ఛుని గారాగృహబద్ధునిఁ జేయించుట కాజ్ఞయొసంగుఁడు.

సిం— భటులారా! యీవిశ్వాస ఘాతుకుని యాభరణము

లూడఁబెటికి యీ తని కరంబులకు శువర్ణ శృంఖలలుదగిల్చి కారాగృహాబద్ధునిజేయుటకు మనపురికిఁ దోడ్కొనిపోవుఁడు భటయుగ్మకు.

భ— చిత్తము మహాప్రభూ!

సిం— మంత్రీ మనముఁగూడ మనపురి కేగుదము రమ్ము.

[ అని యందరు నిష్క్రమింతురు. ]

( కాంచనాపుర కారాగృహంబున చంద్రిమాడుఁడు ప్రవేశించును )

దర్వు — అట — ఖీల్వా.

అక్కటా యీబందిగంబున! నెక్కరణి నివసింపఁబోఫ దునీశ్వరా॥ అక్కటికమును విడిచి యిపుడా! రక్కసుల దొరయిటులఁ జేసెను నీశ్వరా॥ సుతునకాయువు పూర్ణమగునని! సతిని సమకూర్చితినిగాని యీశ్వరా॥ యీ! గతిని గారాగృహమునందు! వెతలఁజెందుదునని యెఱుంగ నీశ్వరా॥ నాసికాబిలంబులీ దు! ర్వాసనలకు సహింపకుండె నీశ్వరా॥ నేఁజేసిన గతజన్మ కలుషము! చెలఁగియిటు వేధించుచుండె నీశ్వరా॥ మక్షికా మశకములు చీమలు! మఱిమఱీ బాధించుచుండె నీశ్వరా॥ యీ! క్షితిని శ్రీమోరి పుర స! ర్వేశ్వరా కరుణింపరాదా యీశ్వరా ॥అ॥

అయ్యయో! దైవమా! యీయంధకార బంధురంబగు నిబందిగంబునఁగల కీటక బాధలకు లోనై యెటుల నివసింపఁగ దు ఇందులకు వెఱచి వెలికిఁ బాఱిపోవుదమన్న నెచ్చటను మార్గము గానరాకుండె. దినసీకుద్య సాహాయ్యమునఁబోయి వెదకి మ చెద. ( అనివెదకుచు నొకగవాక్షముచేతికిఁదాఁకఁగనే) అహా! యేమినాయదృష్టము!

గీ॥ అడఁబోవు తీర్థం బెదు • రైన గతిని।
దిగో గవాక్షంబు దొరకెను • దీనియినుప।
జాలకి జలు నాభుజా • శక్తి విఱిచి।
పోదుసితో వఁ గనన • భూములకును॥

అడఁబోయిన తీర్థ మెదురైన రీతిని నేను మార్గమునకై వెదకుచుండ నీగవాక్షము నాహస్తములకు లభ్యమయ్యె నిఁక నొరుగకు

దెలియకుండ నాభుజా బలంబున నీయునుప జాలకఱ్ఱలు విఱిచి యీ మార్గమున నరణ్యమున కేగెద. (అని విఱిచి వెలికివచ్చి) అయ్యో! యాచప్పుడేమి? అరతుక భటులెవ్వరును మేల్కొనలేదుకదా? లేదు లేదు. ఇదేసమయము. సేనికఁ దఱసినఁ జిక్కగలుగును కావున న రణ్యమునకుఁ బరువిడి పోయెద. (అని నిష్క్రమించును)

(అరణ్యమున నాడుకొనుచు చంద్రకాంతుఁడు ప్రవేశించుట)

దరువు — ఆది — శంకరాభరణ రాగము.

ఆడుకొందు నాడుకొందును! నీయడవిలో నే "నా" ఆడుకొందు నా డుకొందు! నడవిలేడి కూనలతోఁ! గూడిగంతులిడుచుమిగుల! వేడుక తోడ నేనిప్పు "డాడు" పెద్ద పెద్దపండ్లుకోతును! వృక్షాగ్రములు! నొర్ధి కతో నెక్కనేర్తును! మార్గుతప్పివచ్చితిననిమా! యమ్మ నన్నుఁదిట్ట కుండ! ముద్దులాసఁగి యామెమనసు! ముందుగాఁ గరగింపనేరు "నాడు" కోసికొందుఁ గోసికొందును! జక్కనినసలు "కో" వాసిగాశ్రీ మోరిపురని! వాసచింతా వీరభద్ర! దాసవరదునిసాక్షిగామా! తల్లి యిటకురాకమునుపె "యాడు"

ఆహా! యావృక్షాగ్రమున నెంతచక్క నిపండ్లున్నవి? నేనిప్పుడావృ క్షమెక్కి మాయమ్మ రాకమునుపే తప్పక కోసికొందును.

(అని చెట్టెక్కును)

ర— (ప్రవేశించి) సం॥ దరువు — ఆది — బౌరువ

ఎటులఁ బోతివి! నాథా! యెచటనుంటివి! తటుకున ననువిడచి నీ వే! తరువులెక్కితివి॥

చం— దవ్వుపోదునా! నేనీ! డావువిడుతునా! యివ్వనమునఁ బండ్లకురా! నిటురోయవలెనా॥

ర— రాకుమారకా! యిటుల! రాకుమెుంటిగా! భీకరవని యిచట క్రూరమృగము లుండుఁగా॥

చం— అమ్మ పోవిను! భయ! మంద కేవుడును! నిమ్మ హిశ్రీ మోరిపురా! ధీశుఁడుండఁగను॥

అమ్మా (అర్థోక్తిలో)

ర— తాళుము తాళుము నన్నమ్మాయని పిలువకుము.

చం— ఏమని పిలువను?

ర— రత్నమాలికాయని పిలువుము.

చం— అమ్మ యొ్యా! నేనంత పొడుగు పలుకలేను. కొంచెము కొంచెముగాఁ జెప్పుము.

ర— ర – త్న – మా – లి – క

చం— ర – త్న – మా – లి – క

ర— రత్న మాలిక

చం— నేనంతపొడుగు పలుకలేను ఊఁ – ఊఁ –

ర— పోనిమ్ము ప్రియాయని పిలువుము.

చం— ఏమని?

ర— ప్రియాయని.

చం— ప్రి – యా – ప్రి – యా – ప్రియా

ర— ఆహా! నానాథుఁడు ప్రియాయని పిలిచెడు వైభవము నేటికిఁగదా సంప్రాప్తమైనది. రాకుమారా! నన్నిప్పుడు నీవట్లనేపిలువుము.

సంవాద దరువు – ఆది – మలయమారుతము

చం— ప్రియనిన్న నీవొసఁగినట్టి। ఫలము। లీయరాదఁటె తిందుఁగొట్టి ॥ప్రియ॥

ర— అటువంటి ఫలములిచ్చోటు। లేవు। ఆరగించుమివియీ పూట నాథా ॥ఆ॥

చం— ఇవినాకక్కరలేదు సుమ్ము! పోయి। యవియేవేగఁదెచ్చి యిమ్ము! ప్రియా ॥ఇ॥

ర— ఇట్టిపట్టుఁబట్టఁబోకు। లేడి। నిచ్చెద నాడుకొనుటకు। ఓయి ॥ఇ॥

చం— లేడితోనే నాడనమ్మ। గజముఁ। గూడియాడఁకొం

దు నిమ్మ, ప్రియా ॥లే॥

ర— గజమోట్లు దెచ్చియిడఁగలను, నీదు, కామిత మీడేర్చ లేను. ఓయి ॥గజ॥

చం— అట్లయినఁ గరికోఁ బోయి, తెచ్చి యాడుకొం దును బవలు రేయి! ప్రియ ॥అ॥

ర— అయ్యో! ఏటుబోకుమయ్యా! మారిపు, రాధీశు డే యిచ్చునయ్యా! ఓయి ॥అ॥

వ— ఓయీ! ఆఁడుదాన నైన నాయొద్ద నిట్టిమంకుపట్లు ప ట్టిన నేమికార్యము, భక్తజనరక్షకుండగు నాసర్వేశ్వరుండె నీకోరిక లీడేర్పఁగలఁడు కావున నీపట్టువదలి నాతోడ డబాయకుండుము.

చం— గీ॥ నాదుకోర్కెలుదీర్పక • నన్నువిడువ,
కిప్పగిడిమందలించెద • వేటికిఁబ్రియ,
మనమునివసించుటకునిట్టి • వనమెకాని,
వేఱొకయునికియుండ దే • వేడ్కనుండ॥

ప్రియా! మనము నివసించుటకీ యరణ్యమే కాని యితరస్థలం బేదైన లేదా యేమి?

ర— గీ॥ కారణాంతరముననిట్టి • ఘోరవిపిన,
మునకునిన్ దోడుకొనివచ్చి • వనటఁబొందు,
చుండవలసెను; నిఁక మన • మొందుపురికి,
నేగవలెనీకువిద్య నే • ర్పింపనిపుడు।

ఓయీ! కారణాంతరమున నిన్నిటకుఁ దోడ్కొనివచ్చి బ హుదుఃఖము లనుభవింపవలసె. ఇఁక మనముండ నేల? ఒకపట్టణమున కుఁబోయి యచట గురువునొద్ద నీకు విద్యాభ్యాసముఁ జేయింపవలె ను. కావునఁ బోవుదము రమ్ము.

చం— అమ్మా! కాదుకాదు. ప్రియా! గురువన్నగా నెవరు?

ర— విద్యఁజెప్పువాఁడు.

చం— అట్లయిన నాడుకొనుటకు గురువునొద్ద నేనుఁగు

గున్నలున్నవా?

ర— అక్కడ శాస్త్రములతోనే యాడుకోవలయును

చం— అవియెన్ని?

ర— ఆఱు.

చం— అయాఱింటిని నాయన పెంచుచున్నాఁడుకాఁబోలును. మనమా గురువునొద్దకుఁబోఁగానే యాయాఱింటినిఁ దక్షిణము గైకొని యాడుకొందును. కావునఁ ద్వరితముగ రమ్ము. పోవుదము. (అనియిరువురు నిష్క్రమింతురు)

కాంచీనగరములోని పాఠశాల.

(పంతులవారు బాలురతోఁ బ్రవేశింతురు)

దర్వు — ఆది — పూరికళ్యాణి రాగము.

పంతులవారు వచ్చిరి। పాఠశాలఁజేరఁ ॥బం॥ పంతులవారు వచ్చిరి। బడినున్న బాలురతో। సాంతముగా సకల। శాస్త్రములను గఱపెడు ॥పం॥ చదువురానట్టి బండ। సాములదరిఁజేరి। పదిసార్లు విశదపరచి। పాఠముఁ జెప్పనట్టి ॥పం॥ ధారుణి మోరిపుర। ధామునైనట్టి చింతా। వీరభద్ర వరదుని। వేడుచు బాలురతోడఁ ॥బం॥

పం— ఓయీ రాకుమారా! రా— అయ్య.

పం— ఓయీ మంత్రికుమారా! మం॥ కు॥ అయ్య.

పం— వేంకటేశ్వర్లు! వేం— అయ్య

పం— నారాయఁడు! నా— అయ్య.

పం— సిద్దయ్య! సి— అయ్య.

పం— గోవింద! గో— అయ్య.

పం— ఈదినమందఱు బడికి వచ్చియుండిరా?

సి— మొద్దబ్బాయి రాలేదండి.

పం— వెధవని కట్టితీసుకురండి

గోవింద అండ్ సిద్దయ్య [నిష్క్రమింతురు]

పం— రాజకుమారా! నేఁటిపాఠమప్పగించుము.

రా— శ్లో॥ శంభురీశః పశుపతి శ్శివశ్శూలీ మహేశ్వరః
ఈశ్వర శ్శర్వయీశాన శ్శంకర శ్చంద్రశేఖరః

పం... మంత్రికుమారా! నీపాఠమప్పగించుము.

మం— శ్లో॥ ఉమాకాత్యాయనీ గౌరీ కాళీ హైమవతీశ్వరి
శివా భవానీ రుద్రాణీ శర్వాణీ సర్వమంగళా॥

పం— వేంకటేశ్వర్లూ! నీపాఠమేదీ?

వేం— శ్లో॥ విష్ణుర్నారాయణః కృష్ణో వైకుంఠో విష్టరశ్రవాః దామోదరో హృషీకేశః కేశవో మాధవస్స్వభూః

పం— నారాయఁడూ! నీపాఠము?

నా— శ్లో॥ అమరా నిర్జరా దేవా స్త్రిదశా విబుధా స్సురాః సువర్వాణ స్సుమనస స్త్రిదివేశా దివౌకసః

పం— సిద్ధయ్యా!

వేం— అదిగో మొద్దబ్బాయిని యీడ్చుకొస్తున్నారండి.

(అంతటసిద్ధయ్య, గోవిందుఁడు మొద్దబ్బాయి ప్రవేశింతురు)

పం— ఓరీ! మొద్దబ్బాయీ! యీవేళబడికి రానికారణం బేమి?

మొ— (చెఱకుముక్క నమలుచు, పంతులోరుండి యీయాలుండి మాయమ్మొంకి చెఱుకుముక్కిచ్చ్చింకి. పెందలకాడే దూళ్లకాడికెల్లమంనుండి.

పం— ఓరివెధవా! బడిమాని దూడలను గాయుచుంటివా? (అని కొట్టును)

మొ (చెఱకుముక్క నమలుచు చేతులతో కళ్లు తుడుముకొనుచు) లేదండి బాబూ లేదుండిబాబూ చెఱుగ్గఱ్ఱతింటూ బళ్లోకి వస్తున్నానండి. యీళ్లిద్దరుఒచ్చిండి కూం తెట్టమన్నారుండి. పెట్టనంటే యీడ్చుకొచ్చారుండి.

సి॥ అండ్ గో లేదండి గోళీ లాడుతున్నాడండి మేమువెళ్లి రమ్మంటే యిల్లాచెప్తున్నాడండి.

పం— వెధవా! గోళీలాడుచున్నావా? నీపాఠమప్పగించు.

మొ— శ్లో॥ కపర్దోస్య జటాజూటః పీనాకీ జగవంధనుః॥

పం— వెధవా! పినాకోరా (అనికొట్టును]

మొ— [ఏడ్చుచుచు] పంతులుగారు పంతులారు పీనాకీ

పం— ఛీవెధవా! పినాకోఅను [గట్టిగాబాదును]

మొ— పినాకో.

పం— ఈపాటికి చాలించు .. సిద్ధయ్యా! నీపాఠము?

సి— రాక్షసః కోణకస్సరయ్యా.

పం— కోణపః క్రివ్యాత్ [అనికొట్టును]

సి— కోణపః క్రివ్యాత్.

పం— అట్లుచదువు గోవిందా! నీపాఠమప్పగించు

గో— శ్లో॥ యస్యజ్ఞాన దయాసింధూా గోడదాటితే అక్ష సందో.

పం— ఛీ నేడిసినావు. ఈపాటికూరుకో

[అంత రత్నమాలిక చంద్రకాంతునితోఁ బ్రవేశించును]

ర— దరువ - ఆది - శుద్ధసావేరి

తెలుపరమ్మా! గురువు—రియునికిఁ ॥దెలు॥ తెలుపరే యుపాధ్యాయులు వారున్నచో...। ని వేల్పు చెలులారా। యీపట్లఁ గరుణించి ॥తె ఉడుతరకాంతిచే। నొప్పెడుక్షత్రియ తరుణులారావిద్యా। గురువుగారున్నతావు ॥దెలు। అనిశము ధనముచే నభివృద్ధిఁబొందు వైశ్య। వనితలారా గురువు। వారున్న యునికినాకుఁ ॥దెలు॥ వాసిగమోరివుర। వాసునివేఁడుశూద్రి। భాసురాంగులారా। పంతులవారియిక్కఁ ॥దెలుప॥

రాకుమారా! మనయదృష్ట మేమనవచ్చును?

గీ॥ వెదుకఁబోయెడునోషధి ♦ పదములకును।
దగులుకొనురీతినిదెమన ♦ దాపులోన।
పాఠశాలయు ండుల ♦ బాలకులకు।

విద్యఁజెప్పుచుగురువుండె • వేడ్కతోడ॥

ర— రాకుమారా! అల్ల దేపాఠశాల. దానియందుబాలురకు విద్యచెప్పుచు గురువుగారు సుఖాసీనులైయుండిరి. కావున నిన్నచ్చట కుఁగొంపోయి విద్యార్థమై గురువుగారి కొప్పగించెద రమ్ము.

చం— నడుపుముపిన్నమా! (ఇరువురు గురువును సమీపించి)

ర— క॥ గురుస త్తమ మీపాదపద్మ

సరసిజములకేను శరణు • శతములొనర్తు!

గరుణను నీతని విద్యా

పరిపూర్ణునిఁ జేయుఁడయ్య • పండితవర్యా॥

రత్న— అయ్యా! మీకిదే నమస్కరించెదఁ గరుణించి యీ బాలుని సకలవిద్యా విశారదుని జేయుఁడు.

పం— అమ్మా నీయిష్టప్రకార మీబాలుని సకలవిద్యా విశారదుని జేయుదునుగాని నీనామధేయమునుఁ దెల్పి నావీనులఁ దనియఁ జేయుము.

రత్న— అయ్యా! నా పేరు రత్నమాలిక.

పం— ఆచిన్నవాని పేరేమి?

ర— చంద్రికాంతుఁడు.

పం— రత్నమాలికా! మిమ్ముఁజూడ నాకత్యానంద ముద యించుచున్నది. ఈబాలునకు విద్య వచ్చువఱకు మీరుమాయింటనే వసింపుఁడు. రండు పోవుదము.

ర— చిత్తము గురూత్తమా.

పం— ఓశిష్యులారా! మీరీ దినమున నింట్లకుఁబోయి రేపు పెందలకడరండు. నేనురత్నమాలికా చంద్రికాంతులను మాగృహము నకుఁ గొంపోయి వీరికిఁ దగిన సదుపాయములొనర్చి వచ్చెద.

బా— చిత్తము ( అనికొందరు పోవుదురు )

[ రత్నమాలికా చంద్రికాంతులతోఁ బంతులవారు నిష్క్రమింతురు ]

[రాజకుమారుఁడు రత్నమాలికను మోహించి విరహపడుట]

రా— సఖా! మంత్రికుమారా! మనపాఠశాల కరుదెంచిన పాటలాధరి నీక్షించితివా?

మం— ఈక్షింపకేమి? యాయిందీవరాక్షి సౌందర్యము చూపఱడెందముల హరింప నుద్యమించుచున్నది.

రా— ఆహాహా! మంత్రికుమారా!

దరువు — జల్వ — యమునా కల్యాణి.

ఎన్నఁజైనఁ గంటిమే! క్రీయా! వన్నెలాఁడిఁ బోలునన్నువ ॥నెన్న॥ సన్నుతాంగి సొబగుమారుని! సతిరతిని దిరస్కరించు ॥నెన్నఁజై॥ కచములళులదండ్లు! చెలి! కనుబొమలేవిండ్లు! కుచములు నిమ్మపండ్లు! ఆ కుందరదనపైనుండె నాకండ్లు ॥ఎన్న॥ నాసనంపెఁగ సుమము! చెలి! నడుముగగన సమము॥ హాసమిందుపరికాళము! ఆ యతివ నడక హంసగమనము ॥ఎన్న॥ మోముచందురునిబోలు! చెలి! మోవిపగడము నేలు! భామకనులు మీలు! సాన! పట్టిన వజ్రాలుగోళ్లు ॥ఎ॥ వాసిగా శ్రీమోరి! పురశాసుని మదిఁగోరి! యూ! భాసురాంగిఁ జేరి! నా! వాంఛఁ దీర్చుకొందునోరి ॥మె॥

వ— అయ్యారే! యాయన్నువమిన్న సోయగంబెన్నఁ జతుర్ముఖునికైన దుస్సాధ్యముగదా!

మం— దేవా! చతుర్ముఖుఁడన నేల? సహస్రముఖుఁడగు నాదిశేషుఁడు నహిత మెన్నఁజాలునా?

రా— సీ। కనకాఁగితనుకాంతి • కైవగాక కొ్రిమ్మించు
మబ్బులడాగుచు • మసలుచుండె।
నఖముఖ ద్యుతితోడ • నరిగాక చంద్రుండు
హెచ్చు తగ్గుగఁగాంతి • నిచ్చుచుండె।
శుకవాణి మృదువాక్క • లకు నోడికోయిల
కోయనికూసెను • గుజమునెక్కి।
బింబోష్ఠియధరాధ • రంబున కైనగాక
పగడంబుచేకట్లఁ • బడియె నహహ॥

గీ॥ యాసరోరుహనయన దే • హానవచ్య
నాధరములయందము పెర • యతివలకును।
గలదె; యాచెలితోరతిఁ • గలయకున్న।
మనుమనే యెక్కుడ్రక్షణమైన? • మంత్రిపుత్ర॥

అదియునుంగాక.

క॥ మరుఁడురువడి శరజాలము।
లురమున గురిఁజేసివేసె • హమ్మనియుం కే।
కరశిందాళుదుఁ జెలితో।
మరుకేళిం గూడకుండ • మంత్రికుమారా!॥

అమాత్యనందనా! కందర్ప శరపీడితంబగు నాడెందం బాయిందు ముఖి పొందునకై తొందరఁ జెందుచుండె నీక సందేహింపక మనకా సుందరాంగి లభించు నుపాయ మూహించుము.

మం— యువరాజ వతంసమా! యోజించుట కేమున్నది. పెందలకడ భుజించి మనమా మందయాన సంచరించు సందుగొందుల వేచియుందము. పిమ్మట నెద్ది యేనిబనికై యాయన్నమిన్న వెలుప లికివచ్చును. అంత మనమా సుందరాంగి నొప్పించి పొందునల్పుటకు సందేహము లేదు. రమ్ముపోవుదము. (అనియిరువురు నిష్క్రమింతురు.)

[ తిరిగి విఫల మనోరథులై ప్రవేశింతురు. ]

రా— మంత్రికుమారా! నిద్రాహారములు విడిచి యెన్నిదిన ములు గాచియున్నను మనకా సన్నుతాంగి లభింపకుండె నీక నెట్లు తాళుదును?

మం— దేవా! సత్యము సత్యము. ఆచెలి గురువుగారిల్లు విడిచి వెలికివచ్చుట బహుదుస్తరము ఐనను నా మ ది కొ క్క యూ హ స్ఫురించుచున్నది. అది వీలుపడునని తోఁచుచున్నది.

రా— అయ్యో! ఆలస్యము చేసెదవేల? ఏదీచెప్పుచెప్పు.

మం— దేవా! వనవిహారమిషచేఁ జంద్రికాంతు నరణ్యము నకుఁ గొంపోయి యచ్చటనాతెను వధింతము, అటుమీదట నావా ర్త

రత్నమాలిక తెలిసికొని నిజమరణోపాయ మన్వేషింపుచు నెందేనిఁ బోవుచుండును. అప్పుడు మనమామెను వారించి ధైర్యముఁ జెప్పి మెట్టకేలకు నామెను వశపఱచుకొనవచ్చును, సందియములేదు.

రా — బాగుబాగు, నీయోజన కార్యానుగుణ్యమైనదియే. కావున నీవుపోయి చంద్రికాంతునిటకుఁ దోడ్కొనిరమ్ము.

మం — దేవా! అదిగో నేఁబోవనక్కఱ లేకయే చంద్రికాంతుఁడిట్లు వచ్చుచున్నాఁడు.

[ చంద్రికాంతుఁడు ప్రవేశించును. ]

రా — ఆహా! యేమి మనయదృష్టము...ఓయీ చంద్రికాంతుఁడా! మేమీ దినమున నరణ్యమునకు విహారార్థమై పోవుచుంటిమి. నీవుఁగూడ వచ్చెదవా యేమి?

చం — నాకరణ్యమునఁగల విచిత్రములు చూపించినచో వచ్చెదను.

రా — చూపింపకేమి? సమస్త చిత్రములను జూపించెదము. రమ్ము పోవుదము.

చం — నడువుఁడు.

దరువు — అట — ఆనందభైరవి.

నడచిపోయి రడవికప్పుడు శశికాంతునితోడ ॥న॥ అడవిచిత్రములను జూపెద। మంచుఁజెప్పి చంద్రికాంతుని। గెడపఁదలచి రాజసుతుఁడు మంత్రిసుతుఁడు సంతసంబున ॥న॥ తలఁపులు నెఱవేరె ననుకొనుచు। నాకౌతుకమున। దారిదప్పుచు మఱలఁగాంచుచు। బలిమిచే బాలకుని జంపఁ। బాపమంచుమదిఁ గలంగక। యిలను వెలసినట్టి మోరిపు। రీశునికై నను వెఱువక ॥న॥ [ ఇట్లరణ్యమునఁ బ్రవేశించి ]

మం — ఓయీ చంద్రికాంతుఁడా! యీయరణ్యమునఁ గల చిత్రములఁ జూచితివా?

చం — లేదులేదు మీరేవానిని వేఱువేఱుగాఁ జెప్పి చూపింపుఁడు.

రా— ఓరీ! ముందీచిత్రమును జూడుము.

క॥ అరయము వటభూజంబిది
నిరతముభూతంబులిచట • నివసించునుభూ।
వరునాజ్ఞ భటులుచోరుల
శిరములనతికెనరువధ్య • శిలయదెతుత్తా॥

ఓసిడింభకా! యీమఱ్ఱిచెట్టును వీక్షింపుము. దీనియందు భూతప్రేత పిచాచరాక్షస గణములనిశము నివసించి యుండును. అదియునుంగాక, రాజాజ్ఞ చేఁ దస్కరులం గొనితెచ్చి వారితలలీ ప్రదేశంబునఁ దలారులు నఱుకుచుందురు. అదిగో నారక్తసిక్తమగు వధ్యశిలంగాంచుము.

చం— శివశివా! నాకిటువంటి పాపప్రదేశ మెందుకుఁ జూపించితిరి?

మం— ఓరీ! నీకుఁజూపింపఁ దలఁచియే చూపించితిమిరా.

చం— అయ్యో! ఇందుకుఁ గారణమేమో తెల్పుఁడు.

రా— కారణమున కేమిగాని నిన్నటకుఁ దోడ్కొనివచ్చిన దెందులకో యెఱుఁగుదువా?

చం— అన్నలారా! వనవిహారమునకుఁగాదా?

మం— వనవిహారమునకుఁగాము నీప్రాణ సంహారమునకే కొనివచ్చితిమి.

చం— అయ్యో! యిట్లుకఠినముగాఁ బల్కెదరేల? అన్నలారా నన్ను నిరంతరము సోదరునివలెఁ జూచికొనుచుఁ బరిహాసముగా నిట్లుపల్కవచ్చునా?

రా— ఓరీ! పరిహాసమునకుఁగాదు. నిశ్చయముగ నిన్నువధించుటకే కొనితెచ్చితిమి. ఇదిగో! నీఖడ్గములఁ జూచికొమ్ము.

సంవాద దరువు — జడ — నాటకురంజి రాగము.

చం— ననుఁ జంపిన లాభమేమి॥ మీకు ॥నను॥ అనిశము నన్నుమీ॥ యనుజునివలెఁజూచి॥ కొనుచు నీవనిలోఁదలఁ॥ గొటనూ

హింసించితిరి ॥నను॥

రా— నినుఁజంపక విడువమోరి। మేము ॥ని॥ నిన్నుఁజంపి మే మేగి। నిస్సంశయముగనీ। జనని నింతటినుండి। యనుభవింతుమురోరి ॥నిను॥

చం— మాతల్లిననుభవించిన। మీరు ॥మా॥ ప్రీతితోనను గన్న। మాతవలెనీధరణి। నేతల్లి కడుపార। వేళకన్నముఁబెట్టు ॥మా॥

మం— ఇటుమీద యముఁడే వడ్డించు। నన్న ॥మిటు॥ వ టువాగను మిదిగోనీ। వాఁడి యడిదములతో। దటుకునఁద్రుంచి జముతాపురుఁజేర్చెద ॥మిటు॥

చం— కీడేమిచేసితినయ్యా। మీకుఁ ॥కీడే॥ పాడియైనన్నింత బలవంతముగమీరు। వాడియడిదములతో। వధియింపఁదలచితి ॥కీ॥

రా— నుడువకు నీతులిచ్చోట] మాతో ॥ను॥ వుడమిలో శ్రీమోరి। పురమేలు కరకంతు। నడఁగులసాక్షిగ। విడువమురా మాట ॥నుడు॥

ఓరోరి చంద్రికాంతా! నీవుమాకు నీతులు గఱపక యీవ ధ్యశిలపై నెక్కుము, నీశిరంబిదే మాకరవాలముల కాహారము చే సెదము

చం— అయ్యయ్యో! అన్నలారా! దండము దండము. బాల కుండనగు నాయందుఁ గరుణించి ప్రాణములఁదీయక రక్షింపుఁడు.

మం— ఓరీ! యిమ్మాటలు బ్రతిమాలక యీవధ్యశిలపై నె క్కుము. నిన్ను ఋడేయమని కర్పించెదము.

చం— క॥ మాయమ్మ నన్నుఁగానక।
పాయనిదుఃఖాబ్ధిమునిఁగి • బహువిలపించున్।
ఓయన్నలార! నేనిఁకఁ।
బోయెదుఃఖంబువాపఁ • బోనిండుదయన్॥

అన్నలారా! నన్నుఁగానక మాయమ్మ మిక్కిలి విచారించుచుం డును. నేఁబోయి యామెదుఃఖమువాపెద. దయయుంచి ననుఁబోనిండు

రా— ఓరీ! డింభకా! నీజననికి సంతోషము మేముచేయువలయుఁగాని నీవేమిచేయఁగలవు? ఛీ! వదరక నిలువుమురా తులువా.

చం— గీ॥ కటకటా! మేనువడఁకుచుఁ • గాలుసేతు।
లించుకైనను వశముగా • కిపుడునోటఁ।
దడియుగిరియొక్క-మాటైన • నుడువఁజాల।
కున్న నన్ జంపధర్మమా • యన్నలార॥

అయ్యయ్యో! మిత్రులారా! ప్రాణభీతిచే శరీరమెల్ల వడఁకుచు నోట మాటరాకయున్న నాయందుఁ గరుణించి రక్షింపక యిట్లుచంపఁబూనుట మీకు ధర్మముగనుండెనా?

మం— ఓరీ! బాలకా! నీవెంత యేడ్చినను నీయెడ మాకించుకయుఁ గనికరము పుట్టదు. ఎందుకేడ్చెదవు?

చం— ద్విపద। కటాకటా మీకింత • కాఠిన్యమేల। కటికి వాఁడైనమృ • గములనుబట్టి। చంపనొల్లకపరుల్ • చంపినవాని। నింపుగాఁగొనివిక్రయి • యించుచునుండు। పట్టివానికెజీవు • లందునఁ గరుణ। పుట్టఁగా మీకేల • పుట్టకుండెనొకో। సకలరాజధర్మ • సరణులెఱింగి। వికసితహృదయులై • విడువకయిట్టి। ఘోరకృత్యముసేయఁ • గూడునఁటయ్య। కారుణ్యముననన్నుఁ • గనిపెంచుమాత। నారసివచ్చెద • నతివైశముగను। గూరిమిఁబంపుఁడీ • క్రోధంబువిడిచి॥

దయాళులారా! బాలకుండనగు నాయందుమీకుదయ రాకుండెనా? కటికివాఁడు సహితము జీవముగల మృగములను జంపక యితరులు చంపితెచ్చిన వానినిఁ గొని విక్రయించు చుండునే? కటకటా! రాజధర్మములు సర్వమెఱింగియు నిటువంటి ఘోరకృత్యము సేయుట కొడంబడితిరి. ఇఁక నేనేమి సేయుదును? ఐనను మాయమ్మ నొకసారి చూచివచ్చెద. కరుణించి సెలవొసంగుఁడు.

రా— ఓరితులువా! మీయమ్మనుజూచి వచ్చెదవా? నీ మాయలు మాయొద్దనా చెల్లుట? మంత్రీ! నీవీతని శిరంబు వంచి పట్టుకొనుము నాకరవాలమున నీతనిశిరము ధరాతలమునఁ బడునట్లుగా నొ

క్క-వేగ్రిటున నటికెదను. ఇంక జాగుసేయకుము.

మం—— చిత్తము. (అనివంచిపట్టుకొని) రాజకుమారా! యి దిగో వంచిపట్టుకొంటిని. శీఘ్రముగా నఱకుము.

చం—— ఈయమకింకరులు నన్నువిడుచుట యబద్ధము. అన్నలారా! రక్షింపుఁడు రక్షింపుఁడు. మృత్యువుపాలఁ బడనున్న నన్నొకసారి యనుగ్రహించి దేవుని బ్రార్థించుకొననిండు.

రా—— ఓరీ! అట్లయినశీఘ్రముగ దేవునిబ్రార్థించుకొనుము. మంత్రీ! యీసమయమున నీతని నొకనిమిషము విడిచిపెట్టుము.

మం—— చిత్తము. ( అని యట్లుచేయును )

చంద్రికాంతుని దేవహారము.

హరహర! యభ్రికేశ! • యంబుజార్చిత! గిరీశ!
సుర నర మౌనిస్తోత్రి! • సూర్య చంద్రాగ్ని నేత్రా!
కరుణనన్ బ్రోవుశూలి! • కానలో జాలి దూలి
పరమ దుర్మార్గులిపుడు • పట్టి చంపెదరు చూడు.

సుగంధి.

కాలకంఠ! వామదేవ! • కామ సంహారా! భవా!
ఫాలనేత్ర! భక్తపాల! • పార్వతీశ్వరా! శివా
బాలకుండ నన్నుఁబట్టి • బాధసేయుచున్న యీ
కూళలన్వధించిప్రోవ • కున్న నిల్వఁజాలరా.

హా! పరమేశ్వరా! వనవిహారమిషచే నన్నీదుర్మార్గులు కొనితెచ్చి నిర్హేతుకముగఁ జంపనిశ్చయించి యుండిరి. కావున నివేదిక్క-ని వేడుచుంటి నీకుఁ గరుణించి రక్షింపుము రక్షింపుము.

అశరీరవాణి—— ఓహో! చంద్రికాంతుఁడా! నీభక్తికి మెచ్చితిని. ఇఁకనావర ప్రభావమున మహాబల పరాక్రమవంతుడవై వర్ధిల్లుదువుగాక ఇదిగో నీయడిదమును బరిగ్రహించి నిన్నుఁజంపఁ జూచుచున్న యీదుర్మార్గుల సంహరింపుము ( అనునంతలోఁ బైనుండి యొక ఖడ్గము పడును. )

చం— ఆహా! భగవంతుఁడు కరుణగలవాఁడై వరంబొసఁగి నాముందొక ఖడ్గము పడవైచె. ఇఁకనీ ఖరాసి గైకొని యీదుష్టుల బరిమార్చెద (అనిఖడ్గమునుబట్టుకొని) ఏమి? ఈఖడ్గమును స్పృశింపఁ గానే నాకధికబల ధైర్యములొదవినవి ఇఁకనా కేకొంతయులేదు.

ఓరోరి పతివ్రతా మానభంగ కారకులారా! యిపుడెందుఁ బోయెదరు.

కందార్థము.

ఓరోరిదుష్టులారా! ధీరతననుఁజంపవనికిఁ దెచ్చితిరిఁకవినా! కోరి కలఁ దీర్చికొనుటకు! రారండో కూ్రరులారా॥ రయమునమిమ్ముఁ! బంపెదయమపు! రమునకు నిజమ్ము॥ భయమున మిమ్మెంతేఁ! బ్రీతి మాలిననువినక! స్వయముగా ననుఁజంప! సమకట్టిమెలగితిరి॥ నయ ముదుష్నయ మెరుఁగకీగతి! నఱకెఁ బూనినమిమ్ము సారస! నయనుఁ డడ్డమువచ్చికావిడఁ! బయనమగుడోపాపులారా ॥రయ॥

ఓరోరి బాలహత్యా కారకులారా! మిమ్మొకనిమిషములో యమ పురమునకనిపెద. సత్వరమ బయలుదేరి యుద్ధమునకు రండు.

రా— మంత్రికుమారా! యేమిది? తొండ ముదిరి యూసర వెల్లి యయినది?

మం— రాజా! యంతియేకాదు. గొర్తెపిల్ల చూచుచుండఁగ నే పొట్టేలయినది. ఇఁక మనకుఁ జిక్కునట్లు తోఁపదు.

చం— ఓరీ! గొర్తెపిల్లనే భక్షింతురుగాని రండు.

కందార్థము.

ఖలులార! నాడుమాతను! పలచితిరా? యిదిగొఖడ్గ వనితనుమీకీ! యిలజనులు మెచ్చఁ బెంచిలి! సలలితముగఁ జేతురండు॥ సంతోషము గను! దీనితోఁ బొందునల్ప మీరిఁకను! కాంతలవలచి యాకరణి సాధు జనులఁ! జింతల నొందింపఁజేసెను మిముఖడ్గ॥ కాంత కొరఁగాఁజేసి భువిలోఁ! గాంతునేఁ బ్రఖ్యాతిబాల! హంతకాధికులార మీకి దే! యంత్యదిన మరుదెంచెరండిఁక ॥సం॥

ఓకోరి దుర్మార్గ పతివ్రతనులారా! మీరీ ఖడ్గకాంతతోఁగూడి

సుఖాంతముగాసి రండు. త్వరపడుడు.

రా— ఓహో! మంత్రీ! యీబుడుతని పరాక్రమ మంత కంత కతిశయించుచుండె నీకడ్డడసిన వీలులేదు? ఓరోరికీటకమా విశేషించి భాషింపనేల? యుద్ధమునకు వచ్చుచుంటిని. శూరుడవైన చోఁ గాలుగదపక నిలువుము.

చం— ఓరీదోహీ! సంగరమునకు సన్నిద్ధుండనై యుంటిని రమ్ము.

మం— రాజా! యీబాలుఁడు నన్ను వధించిన పిదపఁగదా మీరీతనితో బవరముసేయుట? ముందునేనేగి యీతనితో సమరమొన ర్చెద. కావున మీరిక్కడ నిలిచి చక్కఁగా నాయుద్ధకౌశలముఁ జూచుచుండుఁడు. అనుజ్ఞ దయసేయుఁడు.

రా— మంచిది. పోయిరమ్ము.

మం—. ఓరీడింభకా!

కందార్థము.

నిలునిలు పటపట పేలిక। కలుషాత్మా! నిన్నునాదు • కరవాలముచేఁ దలపడి రాసుతుఁడలరఁగ' బొలియించెద ఘడియలోన:॥ బొంగకతోరి। వరమందితినని బులియకు రోరి। నింగిపల్కినపల్కు నిక్కమంచునమ్మి। పొంగుచుంటివెట్లు పోగలవురమూఢ। సంగరావనియందునాతో। సరిగసమగ మొనర్చు తతిని। స్సింగజ హరుఁడడ్డమైనను హతమొనర్పక విడువవటువా ॥పొంగ॥

ఓరోరివటువా! వెంగలివై నింగిపల్కిన పల్కులు నిక్కముగఁ దలంచి యిటుపొంగనేల? సంగరరంగంబున నీప్రాణంబులు భంగపఱచి నాసంగడీని యంతరంగ ముప్పొంగఁజేతు నిలువుము

చం— ఓరోరి తాగ్రిగుబోతా

సంవాదదర్వు – ఆది – ధీరశంకరాభరణము.

రమ్మురమ్ము బాలహంతకా బవ రమ్మొనర్చ నాతోమానక। రమ్మురమ్ము బవరమ్మున నాఖడ్గమ్మున నీదుశి। రమ్ముద్రుంచెదను ॥ర॥

మం— వచ్చితినిదిగో నిలునిలువుమురా। నీ। గచ్చులిచటఁ జ నికిరావురా। లచ్చిమగనిపద। మిచ్చిన వరమునకు। మెచ్చియీగతి వా। కుచ్చుచుంటివౌర ॥వ॥

చం— మందప్రిజ్ఞ నోరుమూయరా। నీ। న్నిందుగూల్తు ని శ్చయంబురా। సుందరాంగులను బొందఁగోరియీ। చందాన బాలురఁ గుదింపఁజేసెదు ॥మం॥

మం— జ్ఞానహీన నిన్నుఁజూడఁగా। గ్రుడ్డు। కూనను బెద రించినట్లుగా। మానసమున ధైర్య।మూని పొంగుచునుంటి। వీనాక త్తిచే యమస్థానముఁ జేర్చెర ॥వ॥

చం— దిట్టరినని విఱ్ఱవీఁగకు। నీ। పొట్టక్రొవ్వుఁ దీతు మునిటి యకు। నట్టడవిలోనిఁ। మట్టుఁబెట్టుటకుఁ। బుట్టించెవిధిన। న్నిట్టి రూపముతో ॥ర॥

మం— కంతుకవు కేళిగాదురా। యిటు। గంతులగాన మిన్న కుండురా। ఇంతవఱకుఁ గడుపంతఁజెందియిప్పు। డింతతుళ్ళెదవ దెంత సేపురా ॥కం॥

చం— వాసిగాను శ్రీమోరి పుర। నీ। వాస చింతాన్వయ వీరభద్ర। దాసునేలు స। ర్వేశునానతోట్టి। వేసెదనీశిర మీసితాసితో ॥ర॥ (అనికలియఁబడి యుద్ధముసేయ మంత్రికుమారుఁడీల్గును చంద్రి కాంతుఁడు రాజ కుమారుని సమీపించి)

ఓరోరి రాజకుల కళంకా! నీకత్యంతప్రియ మిత్రుఁడగు మంత్రి పుత్రుని నంతక పురమునకిదే పంపించితి. నీవును మచ్చితాసి ఘాతల కు లోనై తత్సన్నిధికిఁ జెచ్చెఱవిచ్చేయుమవు గానిరమ్మురా తుచ్ఛా

రాజకుమారుని కందార్థము.

మంత్రిసుతుని జంపితినని। గంతులువైచెదవు మిగుల । గర్వాంధుఁడవై, కొంతపడి నిలిచినాతోఁ। బంతంబున దురమొనర్చు। బాల కనిన్ను। నీదినమున బ్రిదికిపోనివను। ఆలమందున బలుల హతమొన రెండు నాకుబాలుఁడనఁ గనెంత పాఱిపోకిటునిలుఁ॥ కేలమెఱయుచు

నున్న నాకర। వాలమున నీకంధరంబవ। లీలనఱకి ధరాతలంబున, గూలునట్లొనరింతునోరీ॥ బా॥

ఓరోరి శత్రునా మన్మిత్రుఁడగు మంత్రిపుత్రునిఁ దునిచితినని గంతులు వై పకుము. సమరధాత్రిని శాత్రవుల గాత్రములు సూత్రముగఁ దూఁటులు గావించు నాబోఁటి పోటుమానిసి మోల నిలిచి యేలీలం బ్రతికిపోగలవురా కూళా!

చం— ఓరోరి నిష్కరుణాచేతస్కా!

కందార్థము.

ఏటికిఁ బేలెద విటువా। చాటా! యీపూటనీదు ♦ సంగడికాఁడే। బాటకుఁ జనెనోనిన్నా। బాటకుఁ బంపింతునమ్మ॥ బాలిశ రమ్మ। స త్వరితముగఁ। బయనముగమ్మ॥ మేలుకీడెఱుఁగక। స్త్రీలనువరియించి బాలకులనుజంప। నాలోచించుటగాదు॥ అలమిదె బలశాలివై నం గాలుఁగదపక పోరుమిదెనా। కేల్గల యడిదమున సీతల। నేలఁగూలఁగఁ దునిమి వైచెద ॥బాలిశ॥

ఓరోరి మధుపానమత్తా! చిత్తజ వికారంబున నుత్తమాంగనల పొత్తుహత్తఁగోరి బాలుర కుత్తుకలు కత్తిరింప నాయత్తపడుటయా? కాదు కాదు. సత్తువరాసి వైనచో నిత్తరిఁ గత్తికట్టినాతో దురమొనర్పుము. తత్క్షణము నీయుత్తమాంగమిా కత్తిచే నుత్తరించి నీమిత్రునిం బంపిన పత్తనమునకుఁ బంపెదరమ్మురా ధూర్తా!

సంవాద దర్వు – ఆది – యమునా కళ్యాణి రాగము

రా— నిలునిలు చంద్రికాంతా। పొలి। కలను నలిపివైతుఁ బొంగకింత॥ పలువ! నీవననెంత। నా। బాహుబలము చూపింతు, నీచెంత ॥ని॥

చం— నిలచితినిదిగోరారా। యొక। నిమిషము నాతోఁబోర। నలుకతో ఖడ్గధార। చేత। హతమొనర్చుట సిద్ధమురాకూర ॥నిలి॥

రా— పోరుననునుఁదునుమ। నీ। బోటియఱ్ఱుని తరమా॥ కూరయుంలె పోతరమా।నినుఁగూల్పకుంటేయినిమిాసమూపోసమా॥ని॥

చం— వదరఁబోకుకూళా! కడు! వైళముగను గాల! సదన మునకులీల! నిను! సాగనంపక విడువ నీవేళ ॥వ॥

రా— గర్వమేలపురుషా! ననుఁ! గదిసి పోరఁగలవా! యీ! యుర్విలోనను గెలువఁ! గల! యుక్కుభుజబలు! డెవ్వఁడు రాతులువా ॥గ॥

చం— పుడమిలో శ్రీమోరి! పుర! భుజఁగ భూషణుఁ గోరి! పడసిన కత్తినూరి! నీ! ప్రాణము గొనుచుంటి చూడ కోరి ॥నిలి॥

(ఇరువురు కలియఁబడి దురమొనర్ప రాజకుమారుఁడు గతించును)

చం— హరహరా! యీదుర్మదాంధు లిరువురు మదీయకర వాలమున కెరమై ధరాతలంబునఁ బొరలాడుచుండిరి. అహో పరభామినులఁ బొందఁగోరి పరులవంచలందిరుగు పాపుల పాట్లివియేకదా. అయ్యో యెంతటి రిపులనైనను వధించినపిమ్మటఁ గనికరము పుట్టక మానదు ఐననీ వృత్తాంతము నామాత కెరింగించి యామెకుఁబ్రీతి కలిగించుటకు నేనిప్పుడే పురికిం బోయెదను. లేకున్న నాకై విచారించుచుండును (అని నిష్క్రమించును. రత్నమాలిక ప్రవేశించును)

ర— అయ్యో దైవమా! నానాథు నేకారణముననో రాజకుమార మంత్రికుమారు లరణ్యమునకు వధింపఁగొంపోయి రనువార్త గురువుగారివలన వినినప్పటినుండియు నామనంబనంత దుఃఖవారిధిని గ్రుంగుచున్నయది... హా రాజకుమారా! హా! వదనతృణీకృతరాకాసుధాకరా! హా! సుగుణరత్నాకరా! యీదురాత్ము లిరువురు నిన్నెంతబాధించుచుండిరోకదా.

దర్వు — అట — జాలికాంబోది.

అయ్యయ్యో యాదుష్టు! లదయతన్ని జంప! నడవికిఁ గొంపోయి రా॥ చయ్యనవారలఁ జక్కాడినినుఁబ్రోచు! సదయులెవ్వరు గలరీకాన ॥న॥ ఏపాప మెఱుఁగని! నీపైనాపాపులకుఁ! గోపమేల కలిగెనో॥ ఆపాపివిధినీవా! యధములచేతిలో! హతమాదువని వ్రాసెనా ॥అ॥ కరవాలమున శిరము! ఖండింపఁ బోవనే! కరణేద లడిల్లెదో! ధరమోరిపురసర్వే! శ్వరయాహా గ్రిరులఁ జంపి! వరుఁ బ్రోవనిను వేఁడెదా ॥అ॥

గీ॥ కటకటా! దుష్టబుద్ధులే • కాఅడవికి!
నిన్నుఁ జంపఁగఁ గొనిపోయి • యున్న వారొ।
యెంత వెదకిన నీజాడ • యించుకైనఁ।
గానరాకుండె దుఃఖాబ్ధిఁ • గడచు టెట్లు॥

హా! నవమోహనాకార! యెంత వెదకిన నీజాడ గానరాకుండె నేనేమి సేయుదు? ఈదుఃఖవారిధి నెట్లు దాఁటుదు? ఆదుష్టులు నిన్నె యడవికిఁ గొంపోయిరో కదా (అని చాటునకరుగును)

చం— (ప్రవేశించి) హాజననీ. హాకరుణారసప్రవాహినీ!

గీ॥ నన్ను దుష్టులు చంపవ • నంబునకును।
దోడుకొనిపోయి రనివిని • దుఃఖమాపఁ।
జాలక డవుల వెదకుచుఁ • జాలకష్ట।
మున ననుగృశియింపుచుంటివే • జనని నేఁడు॥

హామాతా! నన్నా దుష్టులు చంపుటకై యడవికిఁ గొంపోయిర నువార్త గురుముఖంబున విని దుఃఖమాపఁజాలక నన్ను వెదకుట కరణ్యముఁ జొచ్చి యెన్ని యిడుమలఁ బడుచుంటివొ కదా.

దరు — అట — ఫీల్వా.

అక్కటజననినా! నన్నన్వేషింపఁగ వచ్చి! యిక్కాఅడవిలో నెన్ని యిక్కట్లఁ బడెనో! యెక్కడఁ గనిననా! మక్కువతల్లినా! దృక్కులఁ బడదింక దిక్కెవరో నాకు ॥న॥ అనవరతము నన్ను నతిప్రేమతోఁ బెంచు! జననినాకై యెంత! వనటఁ బొందెనో కో ॥అ॥ ఇమ్మహి మో రిపుకేశుఁడు కృపచే మా! యమ్మను గనుపఱచి యాదరింపఁడు గా ॥అ॥

ర— "హా! సంఫుల్లవదనసరోజా! హాచంద్రికాంతా"! (యని చాటునరణ్యమాలిక కంఠధ్వని వినఁబడును)

చం— అదిగో! మాయమ్మకంఠధ్వని దూరమున వినవచ్చుచున్నది. ఈవృక్షము లడ్డగుటచే దర్శనము లభింపకున్నది. ఇవిగో. యామె కాలి గుఱుతులు కూడఁ గాన్పించుచున్నవి. కాన నీమార్గమునఁ బోయి నా జనని కానందము గలిగించెద, (అనిచాటునకుఁ బోవును)

ర— (ప్రవేశించి) హా రాజకుమారా! యెన్ని ప్రదేశంబు లారసినను నీజాడ గానరాకుండె నిఁక నేమిసేతును. ఆహా! యేమిది.

గీ॥ అదిగో! నాచక్కనిద్దరు • హతశిరస్కు
లై ధరాస్థలిబడియుండి • రాదురాత్మ
లిరువురునుగుట్రసేసినా • వరునిజంప
వనికిఁదెచ్చినవారల • వలెనుదోఁచు
చుండెవీరలఁజంపిరా • సుతునిబ్రోచి
పున్నెమందినయాపుణ్య • పురుషులెవరొ॥

అదిగో! నాచక్కని హతశిరస్కులై పడియున్నవా రిరువురును మన్నాథుని జంపుటకై వనికిఁదెచ్చిన దుష్టులవలెఁ దోఁచుచుండిరి. ఆ దుర్మార్గులనుజంపి మాచంద్రికాంతు నెవరో పుణ్యాత్ములు రక్షించి యుండవచ్చును. హా సర్వేశ్వరా! శత్రుద్వయమును సంహరించి చంద్రికాంతుని రక్షించియు నాకన్నులకింకను గనుపడువ వైతివిగదా! హా ప్రాణేశ్వరా! మీరాకా సుధాకర వదన మొకసారిచూపి నా నేత్ర చకోరములఁ దనియఁజేయుఁడు.

సంవాదదరువు – అట – ఫీల్వా.

ర— హా రాజతనయా! హా చంద్రికాంతా! నీరూపమీక్షింప లేనెట్లుసైతు! [అనిచెట్టుచాటునకరుగును]

చం— [ప్రవేశించి] అయ్యో జనని! యియ్యడవిలో! నెయ్యడఁగాన్పింప వేనెందుఁజొత్తు॥ [నిష్క్రమించును]

ర— [ప్రవేశించి] రిపుబారిదొలఁగి! యిపుడుగన్పడమి! విపులముగామోద! ఖేదములొదవె! [అనిచాటునకుఁబోవును]

చం— [ప్రవేశించి] ఎటుబోతివమ్మా! యెటనుంటివమ్మా! యెటుకునఁ గన్పడుమి! తాళుదునటమ్మా॥ [అనిలోపలికిఁబోవును]

ర— [ఈవలకువచ్చి] ఇదియేమిపాప! మిఁకదుఃఖమాప! హృదయేశుఁజూప! వేపార్వతీప॥ [నిష్క్రమించును]

చం— [వెలికివచ్చి] మోహినివేశ! యెక్కడనిశ! కూరిమి

మాత॥ గూర్జరనగి ‘త॥

హా! జననీ! మత్సకలకష్టనివారిణీ! నీకంఠరవము వినఁబడుటయే కాని దర్శనమింకను లభింపకుండె. నీవెచ్చట నుంటివో కదా.

చ॥ జనయముఁగంటిఱెప్పగతి • నారయుచుండ ననుఁ; నేఁడు నేనురా!
కునికిగతంబెత్తింగికడుఁ • గుందుచుఁ గ్రూరమృగాళికోడకీ!
వనములనన్నురోయుటకు • వచ్చిననాదగుమాతయేరికై!
ననుగనుపించెనే చెప్పుఁడు • నాపయిభూజములార ప్రేమచే!

అయ్యో! యీభూజముల నొకటియు మాటలాడదయ్యె అయిన నీపక్షి సంఘములఁగూడ నడిగెద.

సీ॥ క్షణమైననన్నుఁబాయఁ • జాలనిమాయమ్మ
వీక్షించిరేకన • కాత్మలార
ప్రీతినన్ బెంచిన • మాతవియోకన్నులఁ
బడినఁదెల్పుఁడు భర • ద్వాజులార
అనవరతంబున • న్నాదరించెడుతల్లి
గాంచియున్నారెయో • క్రౌంచలార
వనికినాకైరోయ • వచ్చినజననిని
గనుఁగొంటిరేమిరు • గరుడులార॥

గీ॥ నాదుమాతనుజూచ్చిరో • నెమ్మలార
కరుణఁగాంచుఁడునన్నుశు • కంబులార
అలసింపక చెప్పుఁడో మ • రాళులార
సంచరింపఁగజాలనో • యంచలార॥

[ అనిమూర్ఛిల్లును. ]

ర— (ప్రవేశించి) హా రాజకుమారా! హా చంద్రికాంతా! నీవా రాజకుమార మంత్రికుమారుల బారినుండి రక్షింపఁ బడుటయు నాకుఁ గాన్పింపకుండుటయు మోద ఖేదములు రెంటను హృదయమున నుదయించుచున్నవి... హా! పాపిదైవమా! ఇంకను నన్నీకష్టవారిధినుండి తొలంగింపవు కాఁబోలు.

సీ॥ పల్కుపల్కుసఁదేవి • లోల్కించు నానాథుఁ
గంటిరే మరు తురం • గంబులార
పక్షిఁజుట్టుకొనిమెడఁ • బడియాడు కచములు
గలవానిఁగనిరె భృం • గంబులార
చొక్కనౌ నడలచే • సంచరించెడుభర్త
నీక్షించిరే హంస • పక్షులార
కర్ణముల్ దనుకను • గ్రిమ్ముచక్షులుగల
పతిఁజూచిరె చకోర • పక్షులార
నాదుధవు నారసితిరె పు • న్నాగులార
యాలసింపక తెల్పుఁడో • యగములార
నాకుఁబ్రాణేశుఁ జూపుఁడో • నగములార
కరుణఁబతిఁ గూర్పుఁడో కల • కంఠులార॥

అయ్యో! యీవనంబునంగల వృక్ష పక్షి గణంబులయం దొకటి యు మాటలాడదయ్యె. ఇఁక నేనెందుఁజొత్తు [అని నడచుచుండఁ జంద్రికాంతుఁడు కాళ్ళకుఁదాఁకును] ఆహా! యేమిది? ఇచ్చట నానాథుఁ డేలొకోపడియుండె. హా! రాకుమారా!

గీ॥ ఏలపడియుంటివి కటికి • నేలయందు!
లెమ్ము శీఘ్రమ్ము నాకు ము • ద్దిమ్ము రమ్ము!
క్రూరబుద్ధులఁ జంపిరి • గూర్మిఁ బ్రోచి
నట్టిపుణ్యాత్ము లెవ్వరో • నాకుఁదెల్పు॥

[అనిలేవఁదీసి] రాకుమారా! యాదుర్మార్గులఁ బరిమార్చి నిన్ను రక్షించిన పుణ్యాత్ములెవ్వరో తెల్పుము.

చం— అమ్మా. కాదు కాదు ప్రియా! నన్నా యీశ్వరుఁడే రక్షించినాఁడు.

ర— వారికి నీతో నింత వైర మేలకలిగినది? నీవా క్రూరుల కేద్దియేనిఁ గీడొనర్చితివా యేమి?

చం— లేదు లేదు నిన్నాదుష్టులు మోహించి నన్ను వధిం

చినఁగాని వారికోరిక నెఱవేఱదని యట్లుచేసిరి.

ర— అయ్యో! హేతువింతవఱకు నెఱుంగనైతి. ఇదియా! తెలిసినది. రాకుమారా! యీదుష్టులఁ బరిమార్చుటకు నీకు శక్తి యెట్లు కలిగినది?

చం— ప్రియా! యాతురులు నన్ను వధించెదమని చెప్పఁగా భయాకులితచిత్తుఁడనై నేనెంతయో వారినిబ్రతిమాలితిని. వారు నాప్రార్థన లంగీకరింప కున్నంతలోనే నీశ్వరునిగూర్చి ప్రార్థించితి. అప్పుడయ్యచలాధిపుఁడు ప్రసన్నుఁడై యశరీరవాగ్రూపముతో నా దుర్మార్గుల వధింపుమని యీఖడ్గము నాముందువేయ నేనట్లుచేసితిని.

ర—. ఆహా! యేమినాయదృష్టము. నేనిప్పటికిఁగదా సనాథ నయితిని. రాకుమారా! నీవాదుష్టులఁజంపినవార్త రాజెఱింగి క్రోధఘూర్ణితుఁడై నిన్నెదుర్కొనకమానఁడు. కావున మన మిచ్చోటుఁ బాసి వేఱొకయిక్కటుం గ్రిక్కునఁ బోదమురమ్ము.

చం— ఆహా యేమి.

గీ॥ ఈపురాధిపుఁడననెంత ♦ యెల్లనృపతు
లేక మైవచ్చి దురమున ♦ డీకొనినను!
జడియకీఖడ్గమునవారిఁ ♦ జంపకుండ!
విడుతునేయింత పిఱికేల ♦ వెఱ్ఱితల్లి॥

కరుణాళుండై హరుఁడొసఁగిన కరవాలము మత్కరమున మెఱయుచుండ నాతో నేయరివీరుఁడు దురమొనర్చి బ్రతికి పోఁగలఁడుతల్లీ?

ర— కాంతుఁడా! నీవంతటివాఁడవే యగుదువు కాని నాపేరు మఱచితివాయేమి?

చం— అమ్మా కాదుకాదు ప్రియాయనుమాట జ్ఞప్తికి వచ్చినది గాని నన్నుఁ గాంతుఁడాయని పిలిచెదవేల?

ర— నీవు కాంతుఁడవు గనుక నే యట్లుపిలిచితిని.

చం— అట్లుకాదట్లుకాదు. నాపేరు క్లుప్తముచేసి పిలిచినచో నపార్థమిచ్చును. కావునఁ జంద్రికాంతుఁడాయని పిలువుము.

ర— ఆ యపార్థమెట్టిదో తెల్పుము.

చం— కాంతుఁడాయని పిలిచినచో భర్తకుఁగూడ నర్థ మిచ్చును. కనుక నన్నట్లు పిలువకుము.

ర— నీవు నాకు భర్త వగుటచేతనే యట్లు పిలుచుచుంటిని.

చం— నేను నీకు భర్తనా?.

ర— ఔను భర్తవే,

చం— ఓసీ! పాపీ! యెంతదోసవుఁగూత గూసితివే?

ఉ॥ పిన్నటినాట నుండిననుఁ ♦ బ్రేమను బెంచుచు జవ్వనుండనై
యున్న తెఱంగెఱింగికడు ♦ నువ్విళులూరుచుఁజంచలాత్మవై
నన్నలయించువింటిఘను ♦ నాజినిఁగూడఁగఁబూనియున్ననిఁ
గ్రిన్ననఁజంపకేవిడువఁ ♦ గాంతరో! యూయడిదంపు వ్రేటుచే
ఓసీఱంకులాడీ! పుత్రుని భర్తఁగాఁ జేసికొనఁదలఁచిననిన్నీయడి దముచే మడియఁజేయక విడువనే చెడుగా! (అని వేయఁబోవును)

ర— శాంతించుము శాంతించుము.

చంద్రికాంతుని దరువు—అట—భైరవి రాగము.

ఎందుకే। శాం। తించుట నేనిప్పు ॥డెం॥ సందియంబెడలించినాదగు। డెందమును మఱలించి ముద్దుల। నందనుండని యెంచకీగతి। నాథునిఁ గవరియించుటకా ॥యెం॥ సుందరాంగులఁ గాంచివావికి। సుతులు సోదరులై నమానక। పొందందలఁచును దుష్టకాంతా। బృందమనునార్యోక్తి నెఱిఁగియు ॥నెం॥ వాసిగా శ్రీమోరిపుర ని। వాస చింతా వీరభద్ర। దాసవరదుండైన స। ర్వేశు సాక్షిగ నిన్నుఁజంపక ॥యెం॥

ఓసీ! కులటా! నేను శాంతించిన నామనసు వేఱొకరీతిగా మఱలించి నన్ను భర్తగాఁ జేసికొనుటకా? ఛీ! దీనికి కారణము దెల్పుము. లేకున్న నాకు శాంతమెట్లు కలుగును.

ర— గీ॥ ఆగ్రహించెదరేల స ♦ మగ్రముగను।
దెలియఁదగు కారణంబెల్ల ♦ దీనివలనఁ।
జదువుఁడీవ త్త్రికనుగాని ♦ సాంతముగను।

భూపతికుమార నాయందు • భూరిదయను॥

రాజకుమారా! ఇదిగో నీపత్త్రికను సాంతముగఁ జదువుఁడు. దీనివలన యావద్వృత్తాంతము మీకే బోధపడఁగలదు.

( అని పత్త్రికనీయఁ జంద్రికాంతుఁడు దానిఁజదివి )

చం— ఓసీ స్వైరవిహారిణీ! నేనీ పత్త్రికనమ్మి నీకు భర్త నగుదు ననుకొంటివా? కానుకాను. నీవంటిమాయలమారు లిటువంటి పత్త్రికలు సృష్టించుట కేమి కొఱఁత?

గీ॥ కపట పత్త్రికఁజూపినక • గాంతుఁగాఁగఁ
జేసికొననుంటి వెంతటి • మోసకారి
వహావా! నిక్క బలియిత్తునీ • యడిదమునకుఁ
దగిన దృష్టాంత మీఁకున్నఁ • దలిరుఁబోఁడి॥

ఓసీ మోసకారీ! దీనికిఁ దగిన నిదర్శనము తెల్పుము. లేకున్న నీ శిరమీ ఖరాసి కాహారముఁజేసెద నే పాపీ! (అనిజుట్టుపట్టుకొనును.)

ర— ద్విపద॥ హా! చంద్రశేఖరా! • హానిటలాక్ష! నీచేత లి టునన్న • నీల్గింపనాయె! నేమిసేయుదునింక • నెటుమనుదాన! నీమ హాత్మ్య నిశంక • లీడేర్చి నన్ను! రక్షించుమయ్య గో • రాజతురంగ! యీక్షణంబునఁ గరు • ణించి వేవేగ.

హా! సర్వేశ్వరా! నన్నుఁ జంపఁబూనియున్న యీచంద్రికాంతుని వారించి నన్ను రక్షింపుము.

అశరీరవాణి— ఓచంద్రికాంతుఁడా! శాంతింపుము శాంతింపుము. ఇదియంతయు నీశ్వరవరంబని యెఱుంగుము. ఈపతివ్రతా శిరోమణి నీభార్యయని నమ్ముము. నీతండ్రి చంద్రమాహేశ్వర ప్రబోధితుఁడై నీయాయువు కొఱకుఁ బదిరెండు వత్సరముల ప్రాయము గల యీమెను నీకుఁ బరిణయము చేసియున్నాఁడు. కావున సంశయ మునుబాసి యీరత్నమాలికను భార్యఁగా నేలుకొమ్ము.

చం— (జుట్టువదలి) ఆహా యీపతివ్రతా శిరోమణి భార్య యని తెలియక నిష్కారణ మెంతపాపమున కొడిఁగట్ట నుద్యమించి

...ని? ముందువెనుక నిదానింప కెప్పుడును దొందరఁ జెందకూడదుగ ...నా? మనోహరీ నాతప్పు సైరించి నన్ను బిగియారఁ గౌఁగలించుకొ ...మ్ము (అని దగ్గరకుఁ జేరఁబోవ)

సంవాద దరువు — ఆది — శుద్ధకాంభోజి రాగము.

ర— నన్నంటవలదు వోప్రియా! నీవు ॥న॥ చిన్ననాటనుండి ...ని నన్నుఁ బెంచినందు। కెన్ని చెప్పినవినక। నన్నుఁ జంపబోతివి ॥న॥

చం— తెలియకనిన్నుఁ జంపఁబోతి। నాకుఁ ॥దె॥ తెలియకొ నరించు నైచె। య్యులకుఁ గోపించుట। చెలియాధర్మమె నాతోఁ। జేరి ముచ్చటలాడు ॥తె॥

ర— జారస్త్రీనిగానటోయి। నేను ॥జా॥ జారస్త్రీలునీతోఁ। జేరిముచ్చటలాడ। నూరకుండువె కేడప। కోరాజనందన ॥జా॥

చం— సతిసోత్ప్రాసపు మాటలాడ। నేల ॥సతి॥ పతినైన నేనిట్టి। పరిహాసవాక్యము లతిచాపల్యుఁడగను। యాగ్రహించెద వేల ॥తె॥

ర— దూరమున నిలచి మాట్లాడు। నీవు ॥దూ॥ సారెసారె కునీకు సరసమాయిదినాతోఁ। జేరకుపొమ్మనిన। జేరవచ్చెదవేమి॥న॥

చం— దాసుఁడ నేరత్నమాల। నీకు ॥దా॥ వాసిగమోరిని వాస వీరభద్ర। దాసవరదుని పాద। ద్వయము సాక్షిగనేను ॥దా॥

ప్రేయసీ! మనవృత్తాంతము నెఱుఁగక నేనట్లుపల్కితిని. ఇందు కై యింత కోపించెదవేల? భర్తనగు నేనీమాత్రపుఁ బరిహాసపు వాక్యములాడఁదగనా? ఇఁక నాతప్పులు క్షమించి నన్నేలుకొనుము. (అని కాళ్లపైఁబడఁబోవును)

ర— తప్పుతప్పు. నీవటుసేయకుము. నాథా నీవాక్యములు నాయదృష్ట సూచకములై యొప్పుచున్నవి. భగవంతుఁడు కరుణగల వాఁడై మనలనిప్పటికిఁగదా కష్టవారిధినుండి గట్టెక్కించినాఁడు.

చం— గీ॥ పడఁతిపది రెండు దినముల • ప్రాయమపుడు।
నన్నుఁగొని తెచ్చి యడవిలో • నున్నతతిని।

నెట్టియూపదలనుబెంద • నీకపెంచి।
పెద్దఁజేసిన నీకిదె • ముద్దునిదుదు॥

ప్రియా! నన్ను పదిరెండు దినముల ప్రాయమప్పుడు గొనితెచ్చి యరణ్యంబులం దెట్టిహానియు వాటిల్ల కుండ నెంతో జాగరూకతతోఁ బెంచి పెద్దవానిఁగాఁ జేసిన నీకేమియొసఁగఁగలను? దానికిఁబ్రతిఁగా నొకముద్దుమాత్రి మిచ్చెద నందుకొనుము.

ర— నాథా! నాకదియేమహోమేరువ. నావాంఛితము నేటికిఁ గదా యీడేరినది.

చం— మనోహరీ! మనమీయరణ్యమున నుండనేల? మా తండ్రిసన్నిధికిఁ బోవుదమురమ్ము. (అని యిరువురు నిష్క్రమింతురు)

(తాపసివేషధరుఁడై చంద్రచూడుఁడు ప్రవేశించును)

చంద్రచూడుని దరువు — రూపకము — బంగాళాతోడి.

ఎప్పటికేవిధి జరుగునో। యెంచవశమె కాలమహిమ ॥యె॥ ఇప్పుడురిపుబారికోడి। యివ్వనమున నుండవలసె ॥నెప్ప॥ సుతునికొఱకుఁ బరితపించి। సితికంఠుని వలనగాంచి। సుతునసఁ సతిఁగూర్పనెంచి। సుతసతులకు దూరమైతి ॥నె॥ కలకలమే దైనవిన్నఁ। గలఁగుదురి ప్రభటులటంచు। నిలవెలసిన మోరిపట్టి। జేశుఁడే యింతకునుగర్త ॥యె॥

అహో! కాలమహిమ! యెప్పటికెట్లు జరుగునో తెలియదుకదా! సకలవైభవము లనుభవించుచు నంతానరహితుఁడనై యీశ్వరునివలన నొక యల్పవయస్కుని బడసి తదీశ్వరాజ్ఞచే నాబాలుని యాయుర్వృద్ధికై పాటుపడఁ గారాగృహ బద్ధుఁడనై యక్కడిబాధలకు సహింపఁజాలక యొకగవాక్షముననుండి వెలువడి శత్రువులకుఁ జిక్కుదునేమోయను భయమునఁ దుదకీ యరణ్యమునఁ జేరి యిచ్చట మునివృత్తిని మెలఁగుచు నెద్దియేని కలకలము విన్నంతనే రిపుభటులిటుల వచ్చుచున్నారని భయపడుచుందును. ఆహా! విధికృత మెట్లుండెను? అదిగో నాతోఁ గెవరెవ్వరో యిరువురిటులనే వచ్చుచున్నారు. వారునాకేవు సంబంధు లేమోకదా? అయినఁ గొంచెము పరిశీలించి చూచెద.

(అని చూచుచుండఁగా దూరమునఁ జందకాంతుఁడు రత్నమాల ప్రవేశింతురు)

చం — ప్రేయసీ! మనకీయరణ్య మెంతనడచినను దఱుగకుండుటయేకాక,

గీ॥ తృషయతిశయించెసీరముల్ • దృక్కులకును।
గానరాకుండె వెదకినఁ • గానలోన।
నెట్లుతాళుదు నాదాహ • మెట్లుఁబాయు।
బోటిరో నోటఁ దడిలేదు • మాటరాదు॥

ఇంతీ! నాకంతకంతకు దాహమతిశయించి నోటఁదడిలేక నుడువుటకు మాటసహితము రాకుండె. ఇఁక నాదాహ మెట్లుపాయునో తెలియదుకదా?

ర — నాథా! యదిగో నాప్రాంతమునఁ బక్షులు వృక్షములధిష్ఠించి ముక్కులతోఁ దమరెక్కలను గీచికొనుచు విదుల్చుకొనుటం బట్టి యాలోచింపఁగాఁ దప్పక యాప్రదేశమున జలాశయముండవచ్చును. కావున నాచక్కికిఁ బోవుదమురమ్ము.

చం — అవును. నిశ్చయముగ నాప్రదేశమున జలాశయముండవచ్చును.. ప్రేయసీ! నీవును మార్గాయాసమున బడలియున్నదానవు గావున నావెనుక మెల్ల మెల్ల నరమ్ము. నేముందుగా నాజలాశయము కడచేగి నాతృషఁదీర్చికొందును (అని నడచుచున్నాఁడు)

(అట్లువచ్చుచున్న చంద్రికాంతునిఁ జంద్రచూడుం డీక్షించి)

చం॥చూ — ఆహా! ఆవచ్చుచున్న నవయౌవనుఁడెవ్వఁడు? ఆతనిసోయగము నామనమును హరించుటయేకాక నాప్రియురాలి లక్షణములుకొన్ని వీనియందుఁ గన్పట్టుచున్నవి. అయ్యో! నాకుమారుఁడు బ్రదికియున్న నిప్పటి కింతవాఁడగునుగదా? హుం — నావంటి భాగ్యహీనునికిట్టి కుమారుఁడుండునా?

చం — (చంద్రచూడుని సమీపించి) ఆహా! యితఁడెవ్వఁడో తాపసివలెఁ గన్పట్టుచున్నాఁడు. నాయదృష్టవశమున నీయనదర్శనమి

చ్చట లభించినది. ఇఁక సంశయింప నేల? యీమునిసత్తముని కమండలువున ముఖ్యముగ జలముండును. కావున నేనాయుదకము నడిగి నాతృషతీర్చుకొందును (చంద్రచూడునితో)

గీ॥ అయ్య! మీకు దేవవందన • మాచరింతు।
దాహమాపంగఁజాలను • దయను మీకు।
మండలువున జలంబును • మానకొసఁగి।
ప్రోవుఁడో తాపసోత్తమ! • పున్నెముండు॥

అయ్యా! నానమస్కారములు గైకొని మీకమండలోదకమిచ్చి దాహశాంతిచేయుఁడు.

చం॥ చూ— ఆ - అట్లనేయిచ్చెదను (అనియిచ్చును)

చం॥ కాం— (కమండలువు గ్రహించి దాహశాంతిచేసికొనుటకై చాటునకరుగును)

చం॥ చూ— అబ్బా యేమిది? యీబాలునిపై నాకంతకంతకు ప్రేమ యతిశయించుచున్నది. కారణములేక యితరులపైఁ గరుణ పుట్టుట దుస్తరముకదా?

చం॥ కాం— అయ్యా! యిదిగో మీకమండలువును గైకొనుఁడు. [ఇచ్చును] పిపాసాతిశయముచేఁ బోవనున్న నాప్రాణము మీరనుగ్రహించి యొసంగిన జలములచే నిలిచినది. ఇట్టి యుపకారము చేసిన మీకేమి యీయఁగలను?

చం॥ చూ— ఓయీ! నీవాక్యము లాలకింప నాకపరిమితానందముదయించుచున్నది. నాకేమియు నీయనక్కఱలేదు. నిన్నొకసారిమాత్రము కౌఁగలించుకొననిమ్ము. [అని కౌఁగలించుకొని]

సీ॥ అహాహా! మేమందు నీ • యాలింగన సుఖంబు
పలుచని గంధలే • పనముకన్న।
సలిల విహారంబు • సల్పుటకంటెను
మలయ వాయువునఁగ్రు • మ్మరుటకన్న
మల్లెపాన్పున నత్త • మిల్లుట కంటెను

నలినారికాంతిలో • నడకకన్న
శీతాంబు స్నానంబు • చేయుట కంటెను
విపులవనమునఁ ద్రి • మ్మరుటకన్నఁ
జల్లనై యుండి నాయొడ • లెల్ల నిపుడు
పులకరించుచు నున్నత్తె • ఫలముకరణిఁ
గానుపించెను; సంతస • మూనుచుంటి
బాలు సంస్పర్శ కెద్దియుఁ • జాలదనుచు।

అహా! యీకుమార సమాశ్లేష సౌఖ్యమున కెద్దియు సాటికాదు కదా! ఓయీ! నీవీయరణ్యంబునకు రాఁగతంబేమి? అదిగో నావచ్చెడు నామె నీకేమికావలయును?

చం॥కాం.— అయ్యా! యామె నామాత కాదుకాదు భార్యయే విధివశంబున నడవులం దిడుమలుపడుచు నిట్లు తిరుగుచుంటిమి.

చం।చూ.— ఆహా! యేమి? ముందు మాతయనియుఁ బిదప భార్యయనియుం జెప్పుటంబట్టిచూడ నితఁడు నాకొడుకును నీమె నాకోడలునునై యుండవచ్చును. అయ్యో! నావంటి భాగ్యహీనునకంతటి భాగ్యమబ్బునా? ఐననింకొక యంశమునుగూర్చి నాకనుమానము పుట్టుచున్నది. నాఁడు సింహకేతుఁడు నాపైకి దాడివెడలి తదాహవంబున నన్నుఁబట్టి ఖండింపఁబోవ నతని మంత్రియగు విద్యున్మాలి యడ్డుపడి యీచంద్రచూడుని జంపవద్దనియు నరణ్యమునకుఁ బోయిన రత్నమాలికా చంద్రికాంతులు దిరిగి వచ్చువఱకు నీతని కారాగారమం దుంచుమనియుఁ జెప్పిన యాతని వచనంబులంబట్టి యోజింపఁగా వారలు వీరలేయని తోఁచెడును — గాకున్న నాతఁ డేలయిట్లు వాక్రుచ్చును? వారికీయడవులలోఁ దిరుగ నవసర మేమున్నది?

ర.— [వీరినిసమీపించి] రాజకుమారా! నీవా మునికడ కేల పోయితివి? ఇటురమ్ము.

చం.— ఆఁ — ఇదిగో వచ్చుచుంటిని. అయ్యా! నాకు సెలవిండు. నేఁబోవలయును. [అని రత్నమాల కడ కేగ]

చం॥చూ— కటకటా! యీబాలుఁడు నన్ను వీడిపోవుటయే కాక.

ఆ॥వె॥ సూదిపిఱుఁదఁబోవు ♦ సూత్రింబుకై వడి।
బాలకుండునన్నుఁ ♦ బాసిపోవు।
చును మదీయహృదయ ♦ మును గొనిపోయె న
య్యయ్యొ యీవియోగ ♦ మనుభవింప॥

సూదిపిఱుఁదనేగు దారముచందమున నన్నీబాలుఁడు విడిచి యరుగుచు మదీయచిత్తమును సహితముఁ గొనిపోవుచున్నాఁడు. కటకటా! నేనీవియోగదుఃఖ మెట్లనుభవింపఁగలను?

ర— ఓయీ! నీవాసన్యాసికడ కేలపోతివి? నిన్నుఁజూచియాతఁడేలవగచుచుండె.

చం॥ కాం— ప్రియా! నేనాతని కమండలోదకమున దాహశాంతిఁజేసికొనుటకై పోఁగా నాకతఁడుదక మిచ్చి మిగుల గారవముతో నన్నేదిచూ యడుగుచుఁ దనలోఁ దానేపరితపించుచుండె.

చం॥ చూ— అమ్మా! నీవాతని మందలింపకుము. నాకాతనియందుఁ గలిగిన యధికానురాగంబున నేనేకొంచెము నేపాపితిని నాపైఁగరుణించి మీయిరువురి వృత్తాంతమించుక తెలియఁజేయుము.

ర— అయ్యో! యేమిచెప్పుదుము. మాపూర్వజన్మకర్మమే మమ్ములబాధించుచున్నది.

చం॥ చూ— అమ్మా! నీవట్లుచెప్పుదువని యడుగలేదు. నాకేకారణముననో మిమ్ముఁజూడ నధికానురాగ ముదయించుచున్నది. కావున మీవృత్తాంతము తెలిసికొనఁ గోరితి దయయుంచిచెప్పుము.

ర— అయ్యో! మావృత్తాంత మింతపట్టదలతో నడుగుటకు హేతువుదెల్పుఁడు. పిమ్మట మావృత్తాంతముదెల్పెదను.

చం॥ చూ— అమ్మా! హేతువునకేమున్నది? కాంచనాపురాధీశుండగు సింహకేతుని కుమార్తె రత్నమాలిక తనకుఁబెండ్లిచేసి నబాలుని దోడ్కొని యరణ్యములఁ గ్రుమ్మరఁ బోయెనని వినియుం

టిని కావున నట్టివారలు మీరేయని యనుమానమున నిట్లడుగుచుంటి

ర— అయ్యా! మీబోటి మునులకడ మారహస్యములు దాఁగునా? అట్టినిర్భాగ్యులము మేమే.

చం। చూ— డెందమా! తొందరఁజెందకుము. ఇఁకనీకోర్కె నెఱవేఱినదిగా నమ్ముము. రత్నమాలికా!

గీ॥ పదియురెండు దినంబుల • ప్రాయముగల।
శిశువునింతటి వానిఁగా • జేసినట్టి।
నీదుసాధ్వీగుణం బెన్న • బోధయగునె।
యడవులం దెన్నియిడుమలఁ • బడితివోకద॥

రత్నమాలికా! పదిరెండు దినముల ప్రాయముగల యీతనిఁ దోడ్కొనిపోయి నేఁటికింత పెద్దవానిగాఁజేసిన నీపతివ్రతా మాహాత్మ్యమునెన్ననాకు బోధయగునా? నీవీతనిఁ బెంచుతఱి యడవులందెన్ని యిడుమలఁ బడితివో యదిమాత్రము తెలియునా? నాయందనుగ్రహించి యీబాలునొకసారి కౌఁగలించుకొననిమ్ము

ర— అయ్యా! మీరీరాకుమారు నీక్షించి యిట్లువగచుటకుఁ గతంబేమో తెల్పుఁడు

చం॥చూ— అమ్మా! యీతనితండ్రి మదీయ మిత్రుండగుటచే నాకాతని సుతునిజూడ మిగులఁ గుతుక ముదయించుచున్నది.

ర— అయ్యా! యీతనితండ్రి చంద్రచూడ మహారాజుగారు క్షేమముగా నున్నారుగదా.

చం॥చూ— ఆఁ- వీరునకు మాత్రము.

ర— అయ్యో! అట్లనుచుంటిరి. వారికే దేని కీడు మూడెనా యేమి?

చం॥చూ— రత్నమాలికా! యేమి తెల్పుదును?

గీ॥ ఇతనిఁదోడ్కొనివనికి నీ • వేగఁగానె।
నారదుండరుదెంచి మీ • నాయనకిది।
చంద్రచూడుఁడుచేసిన • యింద్రజాల।

మనివచింపఁగరాదా్రి రు • కౌతుఁడయ్యో!
నతనిబంధించెఁగారా గృ • హంబునందు॥

అమ్మా! నీవతని నరణ్యమునకుఁ దోడ్కొనిపోఁగా నీతండ్రికడకు నారదుండరుదెంచి యిదియంతయుఁ జంద్రచూడుఁడు చేసిన మాయ యని వచియింప సింహకేతుఁడు క్రోధకషాయితనేత్రుఁడై చంద్ర చూడుని గారాగృహ బద్ధుని జేసెను

ర— కటకటా! యెంతపని జరిగినది? అట్లుజరుగునేమో య నుభయమున నేనితరులకుఁ దెలియకుండ వచ్చినను జరుగక తప్పినది కాదు అయ్యో! వారు సంతానము పడసినందులకు ఫలమిదియే కాఁ బోలును? హుం-యెంతటివారికైనను విధివశము తప్పదుకదా!

చం॥కాం— ఏమేమీ? సింహకేతుఁడు మజ్జనకుని గారాగృహ బద్ధుని జేసెనుగా? శత్రువన వీతిహోత్రుండగు చంద్రకాంతుం డరు దెంచి పుత్ర మిత్ర బంధుసేనామాత్య సహితంబుగ సమవర్తిపురి క ణుమాత్రములోఁ బంపించునని యించుకేనియు నెఱుంగఁడు కాఁబో లును. ప్రేయసీ! ఇఁకఁదడయనేల? అప్పలలాశి నివాసము నాశుగతిం జని మచ్చితాసితో నాతని యసువులందీసి మత్పితృప్రాణము ఁ్ర్చికొను టయేకాక నాక్రోధానంబెల్లఁ జల్లార్చికొందు. ఇదె పోవుచుంటి వేగ మరుదెంచుము.

చం॥చూ— నాయనాత్వరపడకుము త్వరపడకుము. నీతండ్రి లజ్జావిహీనుఁడై చెఱనుండి వెలువడి ప్రాణములతో నున్నాఁడుసుమా

చం॥కాం— ఏమీ? మాతండ్రి నిజముగఁ గారాగృహమునుం డి వెలువడెనా? అటులైన నాయన యిప్పుడెచ్చట నుండెను?

చం॥చూ— కుమారా! యట్టి జీవచ్ఛవమును నేనే. ఇతరుల కుఁ దెలియకుండ నీవేషముతో నిచ్చటనుంటిని.

ర— అయ్యో! నిజముగఁ జంద్రచూడ మహారాజుగారు మీరేనా?

చం॥చూ— ఔను. నిశ్చయముగ నేనే. ఇదిగో నింపుకుఁ

దార్కాణము చెప్పెద వినుము నాఁడు మీ వివాహ సమయమున నొ కపత్త్రిక లిఖించి యీబాలుని మెడలోఁ గట్టితిని.

ర— రాకుమారా! ఇఁక సంశయింప నేల? యీపత్త్రిక వృత్తాంతము మీతండ్రిగారు తప్పఁ దదితరు లెఱుంగరు. కావున మీతండ్రిగారికి నమస్కరింపుము. (ఇరువురు నమస్కరింతురు)

చం॥చూ— దీర్ఘాయుష్మాన్ భవ సౌభాగ్యవతీభవ. (అని పుత్త్రి నెత్తుకొని) కుమారశరీర సమాశ్లేషసుఖము నీవలనఁగదా నేఁడు గంటెని? రత్నమాలికా!

క॥ పోఁగొట్టుకొన్న ధనమును।
బాగొప్పఁగఁ దెచ్చియిచ్చి ♦ పాలించుక్రియన్।
వేగమె సుతు నిచ్చితి నల।
భోగీంద్రుఁడు నీసుచరిత ♦ పొగడంగలఁడే॥

కోలుపోయిన ధనమునిచ్చి పాలించినలీల నాసుతుని మరలఁ గరుణచే దయచేసితివి. నీసుచరితమా యాదిశేషునకైన వర్ణింపఁ దర మగునా?

ర—. అయ్యా. ఇదియంతయు మీపుణ్యవిశేషముననే జరిగినది.

చద్రికాంతుని గీతార్థము.

తండ్రి! మనమింక నిచ్చటఁ ♦ దడయనేల। నిన్ను బందిగమునను౦చి ♦ మెన్నరాని। బన్నముల్ పెట్టినట్టియా ♦ పాపసింహ। కేతునిన్ వధియింపనే॥ గెదమురారమ్మ॥ ఏగియురాజ్య। పదవిఁ గొందము। మదమున వాఁడెంతో మైమెఱుఁగకుండెనా। హృదయ క్రోధము దీర్చికొనుట కు। సదనిదియె సదమలచరిత యే ॥గెద।

నాయనా మనమింకఁ దడయనేల? ముందువెనుక లరయక నిన్ను బంధకాగార వాసునిగాఁ జేసిన తద్బృందారకారి సమందగర్వు వధించి డెందమలర రాజ్యేందిరను గైకొంద మరుగుదెంచుఁడు.

చం॥చూ— కుమారా! వాఁడు మిగుల బల పరాక్రమములు గలవాఁడుగదా?

చం. కాం— ఐననేమి? దైవసహాయముగల నాముందాతని బలపరాక్రమము లేమిలెక్క? ఇదిగో వాని ఖండించుటకుఁ దగిన యాయుధము నిదివఱకే భగవంతుఁ డనుగ్రహించి యిచ్చినాఁడు. కావున పోదమురమ్ము.

ర— అయ్యా! ముందుగా మీరు యుద్ధమునకుఁ ద్వరపడక మనరాజ్యము మనకిమ్మని యడుగుఁడు. అట్లీయనిచో మీయిచ్చవచ్చి నట్లొనర్పుఁడు.

చం. కాం— అట్లే చేసెదము. వాఁడుమాత్రి మెఱుఁగనివాఁ డా పోదమురండు. (అందఱునిష్క్రమింతురు)

[కాంచనాపురిలో సింహకేతుఁడు మంత్రిలు ప్రవేశింతురు]

సిం— విద్యున్మాలి,విరూపాక్ష,వికచలోచనాది మంత్రిలారా!

క॥ చెఱసాలనుండి వెలువడి।
యరిగినయాచంద్రచూడు • నరయుటకై యీ
వఱ కరిగిన మనభటులా।
దురితాత్ముని బట్టియిటకుఁ • దోడ్తెచ్చిరొకో?

కారాగారమునుండి పారిపోయిన క్రూరుని నారయుటకై వేగిన మనచారులు వానిని దోడితెచ్చిరా?

మం— లేదులేదు. మనముపంపించిన భటులలోఁ గొందఱు వచ్చి యామందుండెందును గాన్పింపలేదని విన్నవించిరి.

సిం— అహో! మన చారులకా మందుండెందును గాన్పింప లేదుగా అయిన నిపుడువాఁడు.

దర్వు — ఆది — నాట

ఎందుడాఁగియుండెనో। చంద్రచూడుఁడిప్పు ॥డెందు॥ బందిగమున బల్ గుందుచుఁజివరకు। నందుఁగాంచి పందమైనమందుఁడు ॥ఎందు॥ గహన మధ్యముఁజేరెనో। పోయిపోయిభూధర। గుహలనడుమడాఁగెనో। బహువిధములఁదగ బాధించెడు కారాగృహపాలురు నిద్రింప నేగి యిపు ॥డెందు॥

వ॥ ఆహా మదీయాజ్ఞోల్లంఘన చేసిన మందప్రజ్ఞుఁడెందు దాఁగి గుందుచున్నను బృందారకవైరి బృందంబుల డెందంబులు పల్లవింప నిం-వరాప్త నందనుని ముందఱనిల్పక యీచంద్రచూడుని విడుతునా?

భ— (అంతలో భటుఁడొకఁడు ప్రవేశించి) దేవా! చంద్రచూడుఁడొకనిఁ బురస్కరించుకొని తమ దర్శనమునకై ద్వారముకడ వేచియుండెను.

సిం— ఏమేమీ పలాయితుఁడైన చంద్రచూడుఁ డొకనిఁ బురస్కరించుకొని లజ్జావిహీనుఁడై నాదర్శనమునకు ద్వారముకడ వేచియుండెనా? ఆదుర్మార్గుని సత్వరమ ప్రవేశపెట్టుము.

భ— (నిష్క్రమించి చంద్రచూడ చంద్రికాంతులతోఁ బ్రవేశించి) దేవా! చంద్రచూడుఁడు వీఁడే చూడుఁడు.

సిం— ఓరోరి త్యజితవ్రీడా ప్రతాపా! చంద్రచూడా!

గీ॥ బందిగమునుండి వెలువడి • పాఱిపోయి।
ఒరులకగుపడకుండఁగా • మఱుగుపడియు।
సిగ్గులేకిప్పుడొకని నా • దగ్గఱకును।
వెంటగొనివచ్చి నావంత • తుంటరివిర॥

ఓరోరిరాజ కులకళంకా! బందిగంబునుండి పలాయితుఁడవై సిగ్గులేక నాదగ్గఱకొకనిఁ బురస్కరించుకొని వచ్చితి వికనెందుఁ బోఁగలవురా పందా!

చం॥చూ— ఓరీ రాత్రించరా!

గీ॥ కాఱుకూఁతలు గూసినఁ • గార్యమేమి।
కనుము నీయల్లుఁడీతని • కాంతరత్న।
మాలికయు క్షేమమునసుండె • మాకురాజ్య।
మిమ్ము లేకున్న జివ్వకు • రమ్ము లెమ్ము॥

ఓరీ! నిశాటా! కాఱులు పేలినఁ గార్యమేమి? నీ జేసీయల్లుఁడగు చంద్రికాంతుఁడు నీకూఁతురు రత్నమాలికయు క్షేమమున నున్నది.

ఇకఁక వైరము పూనక మారాజ్యము మాకిమ్ము. లేకున్న యుద్ధమ
నకు రమ్ము.

సిం— ఓరీ వారి సౌఖ్యమునకు సంతసమొందితిని. కాని
వానర్చిన మోసమునకు మాత్రము నిన్ను విడువను కావున.

సంవాద దరువు – ఆది – కళ్యాణి.

రమ్ము రోరి దురమునకు। నమ్మకద్రోహి యీక్షణము। లేము
రా శీఘ్రమ్ము నీయు। రమ్ము నశి। రమ్ము గ్రమ్మద॥ నిమ్మహీపతులెల్ల
మునే। కమ్మైనాతో ద్రోమ్ము సేయఁ। దమ్ముల చెలికాని సుతునిబు।
మ్ము సత్వరమ్ము జూపెద ॥రమ్ము॥

చం— నీయల్లుఁడ నైనందుకు। నాయందుఁ గరుణించి నాద
నాయన పై వైరమేల్మెడఁ। బాయనంటివి గావున। న్యాయమరయ నేన
వైరి। నైతిని మారాజ్యము మా। కీయుము లేకున్న దురము। నే
యుము మనకదియే శ్రేయము ॥నీ॥

వ— మామా! నీయల్లుఁడ నైన నాపైఁ గరుణించి మాత
డ్రిపై వైరము విడువనియెడల మాతండ్రితోఁబాటు నేనును మీకు
వైరి నేకావున మారాజ్యము మాకిమ్ము లేకున్న మనబంధుత్వ మి
తటితో సరియనినమ్ము యుద్ధమునకు సిద్ధముగమ్ము.

సిం— ఓరిపటువా! వేలికణు పెసుతేవు. నీవా నాతో యు
ము సేయుట పోమ్ము. దూరముననుండి ప్రాణములఁ గాచికొమ్ము

చం॥ కా—ఏమి! పేరునకా పెద్దతికము.

గీ॥ అగ్నికణమెంత చిన్నది ♦ యైనఁగాని।
తీక్ష్ణగుణమున కదిపెద్ద ♦ దియెసుమండి।

సిం— అట్లనా యేదిరోరినీ ♦ యగ్నికణప్రి।
భావమునుజూపునాముందు ♦ పాఱిపోక॥

వ॥ ఓరీ నీయగ్నికణ ప్రభావ మెట్టిదో చూపుము.

చంద్రికాంతుని కందార్థము.

లయకాలరుద్రు డూర్ధ్వపు। నయనానలకీలఁబఱపి ♦ నానాపురవ

ల్। లతుముసలుప్రగతి నీపురి। లయమొనరించెదను శరజా। లము ప్ర
యోగించి। కాంచుము నాబ। లము నిదానించి। సమరమందున వైరి
సంఘంబులనుబట్టి॥ సమయఁజేసెదు నన్ను నీవెక। నక్కమానెద వేల
శరజా ॥లము।

వ॥ ప్రళయకాల రుద్రనయ నానల జ్వాలప్రజ్వరిల్లి యుద్ధరాతలంబెల్ల దహింయించు చందంబున మద్భీషణ బాణజాలంబు ప్రయోగించి నీపురంబు భస్మీపటల మొనర్చెదుతతి మద్బల పరాక్రమ మరసెదవుగాక.

సిం— ఓరీ! దంభప్రలాపా?

ఉ॥ చాపముపూర్తిగాఁనిలుపఁ • జాలవుహస్తమునందు దుర్మతీ।
తూపులనెట్లు వేసెదవు • దోర్బలమెయ్యది దంభవాక్యముల్।
ఈపగిదిన్ వచించెద వ • దెందుకు బీరములింక మానియున్।
నాపదపద్మముల్శిరము • నందిడిమ్రొక్కుమఁ బ్రోతుని త్తర్క॥

ఓరీ నిష్కారణ మేలచచ్చెదవు? నీబీరములు విడిచి నా పాదముల కెరగుము. నిన్నిప్పుడు శిక్షింపక కక్షవిడిచి యక్షీణ కటాక్షముతో రక్షించెద.

చం॥కా— ఓరీ దైత్యకుల కళంకా. నీకానన్ను రక్షించు వాఁడవు. ఇదిగో నాప్రతిన వినుము.

చ। ఉడుగణమెల్లనొక్కమొగి • నుర్వికిడుల్లినసీర జాప్రుఁడా
పడమటికొండఁబుట్టినను • బాగుగసంద్రము లెండిపోయినన్
పుడమివడింజలించినను • భూరిబలాఢ్యుఁడుచంద్రకాంతుఁడా
వదుపున మ్రొక్కునేరిపుల • వారకతున్రించునుగాని ధీరతన్॥

ఓరీ సింహకేతుఁడా! ఇట్టియుత్పాతము లెన్ని యుద్భవించినను బలపరాక్రమ శాలియగు నీచంద్రకాంతుఁడు ధైర్యముదూలి వైరులఁజేరి శరణము గోరునని స్వప్నమందైనఁ దలంపకుము.

సిం— గీ॥ ఓరిడింభక మనబల • మొరుబు మెచ్చు।
కొనవలయుఁగాని మనయంత • మనము చెప్ప।

కొనుచుమరియుట యదియొక్క • గొప్పతనము।
గాదునీతండ్రియెఱుఁగును • నాదుబలము॥

వ॥ ఓరీడింభకా! మనబలాబలంబులు పలుకుచెప్పుకొని నంతసింపవలె నుగాని నీయంతటనీవును నాయంతటనేనును జెప్పుకొని మరియుబ యూకాదుకాదు నాచేఁ గారాగార బద్ధుఁడైన నీతండ్రియె నాబలా బలంబులఁ బూర్తిగా గుర్తెఱిఁగినవాఁడు. అడిగి తెలిసికొనుము.

చం॥ చూ— ఓరీదుర్మతీ! అధర్మ యుద్ధమున నన్నుఁబట్టుకొని రణశూరుని విధంబున నీవానన్ను సాక్ష్యము గోరువాఁడవు. ఎందుకు ముందేనాతో ధర్మయుద్ధ మొనర్చితివేని నీయాయువు నప్పుడే తీయకవిడుచువాఁడ ననుకొంటివా? ఇఁక నీప్రగల్భములు కట్టిపెట్టుము.

సిం — ఓరీపశువా! యొక నిపటము కనుపఱచి వేరొక నిసువు నకు నాసుతను బాణిగ్రహణము గావించిన నీదిధర్మమా రాజనీతిఁ బూని యుద్ధమున నిన్నుఁబట్టి పరిభవించుట నాది యధర్మమా ఔరా! తనవీపు తనకుఁ గాన్పించ దనునటుల నున్నవిరా నీవచనములు.

చం॥ కాం— ఓరోరి రుధిరపానమత్తా! ఈశ్వరవర ప్రభావమునం జరిగినపనికి మాతండ్రిపై దోష మారోపించెదవేల?

సిం— ఏమీ యీశ్వరుఁడునన్ను మోసముచేయుమనియా మీకువరమిచ్చుట? అట్లయిన తనకపాల మాలికా పూర్తికై మీయిరువురి శిరముల నతికి తెమ్మని శంకరుఁడు నాకును సెలవిచ్చినాఁడు,

చం॥ కా— ఏమీ మాటలలు దుర్మించుమని శివుఁడు నీకాజ్ఞ యొసఁగెనా? అట్లయిన

సంవాదదరువు — అట — యమునాకళ్యాణి.

రారాయిదె గూల్తునొక। నారసముచేతనిన్ను। క్రూరాయిటులాడనీకు। మేరాసారె। సారెకును॥

సిం— ఓరీ శతసింహములు। దోరింపఁగఁగల్గునాతో। మీాటి యెదు రాడెదవు! పరుబోధఁ జేసినారు॥

చం॥ కా— ఆహామృగములఁ జంపినందుచేత శూరుఁడ౯ా౯ే. ఆహవమునందు రిపు! హంతకుఁడు గావలయు॥

సిం— ఔరా పిన్నవాఁడవని! యూఱకున్న కొలఁదియెంతో! వైరమూని నాదుపైకి! వచ్చుచుంటి వచ్చుపడ॥

చం॥ కాం— పాఱుఁబోత దంభములు! బల్కనేల చేతనైతె! పోరులోన నన్ను గెల్చి! పొందరోరి జయలక్ష్మిని॥

సిం— బంతులాటగాదురోరి! బాలురతో నాడుటకుఁ! బంతముసఁ దూపులాడ! లంతనాటుకొంటగాని॥

చం॥ కాం— ఇమ్మహి శ్రీమోరిపుర! ధీశుసాక్షిగాసునే! బహ్మశిరో నామాస్త్రముఁ! బంపుచుంటిఁ గాచికొమ్ము॥

(అని యిరువురు కలియఁబడి పోరుచుండ పార్వతీ పరమేశ్వరులు అయ్యో భక్తులారా! అయ్యో! భక్తులారా! అనుచుఁ బ్రవేశించి పార్వతి సింహకేతుని బరమేశ్వరుఁడు చంద్రికాంతుని బట్టుకొని)

శి— ఏలయీలీలబేలవైలై యాలంబున శూలంబులఁ బ్రాణంబులఁ గోలుపోయెదరు. ఓయీ చంద్రికాంతా!

ఆ॥ వె॥ పిన్నపెద్ద తనము • లెన్నకమామతోఁ,
జనునెదురముసేయఁ • జలముపూని!
లోకులెల్లరునినుఁ • గాకులవలెనెత్తిఁ,
పొడుతురుసుమిమామఁ • గెడపితివని!

వ— ఓయీ మామయని యించుకేనియు గౌరవింపక యలుకఁబూని కలనున సంహరింపనెంచితివా? అయ్యో కాకులఁబోలు లోకులచే నెత్తిపోటులు మాటిమాటికిఁ బడుచునే యుందువు. కావున నీవైరముమాని మామతో నిష్టగోష్టిఁ బ్రిన్నత్తిల్లుము.

పా— ఓయీ సింహధ్వజా!

క॥ ఉల్లమున జాలిపూనక!
యల్లుని రణమందుఁజంప • నాలోచింపక!
జెల్లునె నీకొమరితయును!

— గొల్లుమటంచేడ్వకున్న; ♦ కూడునేఁకుఁ॥

నీయల్లుని దెగటార్చిన "మాపిల్ల యుల్లంబుపగుల గొల్లుగొల్లున చింతిల్లుటయేకాక నీవును పిల్ల విషయమై తల్లడిల్లవలసి యుండును. కావున రత్నమాలికా చంద్రికాంతుల పునర్దర్శనమునకు సంతసించి వారిరాజ్యము వారికొసంగుము.

సిం— చిత్తము. వారిరాజ్యమన నేల? యుభయరాజ్యముల కుఁ జంద్రికాంతునే పట్టాభిషిక్తుని జేసెద.

(అంతలో రత్నమాలిక ప్రవేశించును)

ర— పార్వతీ పరమేశ్వరులారా నమస్కారము.

పా॥ ప— శీఘ్రమే. పట్టాభిషేక మహోత్సవ ప్రాప్తిరస్తు.

{ అంత రత్నమాలికా చంద్రికాంతులకు నుభయరాజ్య పట్టాభిషేక మొనర్తురు. }

మంగళం — మంగళం — మంగళం.

మంగళహారతి — ఆది — సరస్వతీ మనోహరి.

మంగళమిదె కరిచర్మాంబరధర। మహేశ్వరలింగ॥ అంగజగర్వవి భంగా వృషభతు। రంగా హస్తకు। రంగా జయజయ ॥మం॥ గంగా ధర మునిజన హృత్సంగా, గౌరీయర్ధాంగా। మంగళకరది। వ్యాంగా ధృతఖ। ట్వాంగా ధరణిశ। తాంగా జయజయ ॥మంగళ॥ వాసిగమో రినివాసా సుమనో। ల్లాసా, సర్వేశా। భాసురతర చిద్వి। లాసా వద నవి। కాసానగజా ధీశా జయజయ ॥మం॥

గద్య

ఇది శ్రీమత్సర్వేశ్వర కరుణాకటాక్ష వీక్షణ సమాలబ్ధ. కవితా వైభవ కాత్యాయనసూత్ర పతంజలినగోత్ర. పవిత్ర చింతాన్వయ కలశార్ణవ. రాకా కైరవమిత్ర. నాగమాంబా సుబ్బారాయ సుపుత్ర వీరభద్ర. నామధేయ ప్రణీతంబైన చంద్రికాంతనాటకము.

సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.

| పేజీ | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 11 | 3 | బావింపుచు | భావింపుచు |
| 13 | 22 | సుచరణ్యా | సుశరణ్యా |
| ,, | 25 | హేమాద్రిశసన | హేమాద్రిశరాసన |
| 14 | 26 | సిద్విలాస | చిద్విలాస |
| 23 | 20 | మారొనిదురమున | మార్కొనిదురమున |
| 26 | 18 | సకూడునని | సమకూడునని |
| 31 | 11 | సంతోభము | సంతోషము |
| ... | 12 | పబముల | పటముల |
| ... | 25 | బరిశీలింము | బరిశీలింపుము |
| 32 | 13 | బోయివల్చెద | బోయివచ్చెద |
| 34 | 17 | నెయ్యోవ్డిస్సారవ | నెయ్యోడ్డిస్సారష |
| 36 | 18 | మంసమున | మందసమున |
| 39 | 3 | నేడెయుచున్న | నేజేయుచున్న |
| ... | 4 | మనుచుంజే | మనుచుండె |
| ... | 18 | ఆహాహా | అహాహా |
| ... | 23 | విచిరి | విడిచిరి |
| 41 | 25 | మానిపంక్ల | మ్రానిపండ్ల |
| 48 | 3 | సర్వైశ | సర్వేశ |
| ... | 23 | ధదణి | ధరణి |
| 50 | 22 | కోరులుదీర్చి | కోర్కులుదీర్చి |
| 52 | 9 | లంఘిచి | లంఘించి |
| 53 | 5 | ఓపప్రితివతా | ఓపతివ్రితా |
| ... | 15 | గనులిపుడు | గన్నులిపుడు |
| 54 | 4 | సంఘటిల్లెను | సంఘటిల్లెనో |
| 57 | 23 | సింహాతుని | సింహకేతుని |

| | | | |
|---|---|---|---|
| 58 | 10 | నాపికటము | నానికటము |
| ... | 15 | ఒసింహాకేతాన్వఖ్య | ఓసింహాకేతాన్వఖ్య |
| ... | 21 | పల్క-వరమిడ | పల్కి-వరమిడ |
| 59 | 12 | అంబకల | అంబకముల |
| 60 | 1 | శువర్ణ | సువర్ణ. |
| 66 | 21 | వారునయునికి | వారున్నయునికి |
| 77 | 9 | జేర్చెర | జేర్చెద |
| 79 | 1 | నదన | సదన |
| ... | 9 | అహో | ఆహో |
| 81 | 25 | దుఖమూప | దుఃఖమూప |
| 84 | 10 | నేఃక్పటికి | నేసిప్పటికి |
| 87 | 8 | చైయ్యులకు | చైయ్వులకు |
| 89 | 1 | జందకాంతుడు | జంద్రికాంతుడు |
| 90 | 17 | చేఃవనున్న | చేఃజావనున్న |
| 91 | 8 | అహా | ఆహా |
| 92 | 21 | సదికానురాగ | సధికానురాగ |
| 95 | 11 | నిచ్చితినల | నిచ్చితివల |
| ... | 1[illegible] | పాపసింహా | పాపిసింహా |
| ... | 22 | సదనిది | సదనిది. |



